








O&M / 3802

Help Rohan find his Fun Centre™.

Chocolate Lemon Pineapple Elaichi

# Fun Centre™

## Cream Biscuits

*The Fun is in the Centre*

MRP Rs. 8.00 inclusive of all taxes for net wt. 100 g

visit us at www.parleproducts.com



PIRANHA



ACTIVE



CADET HX



YANKEE



ROBO COP

# Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.

Because it's never too early to be a hero.



















## ఈ సంచికలో...






**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.**120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# వినిర్మల భావాలు - పరిశుభ్ర పరిసరాలు

ఇటీవల ప్రపంచంలోని కొన్నిప్రాంతాలలో మహమ్మారిలాంటి ఒక వ్యాధి ప్రబలి పలువురి ప్రాణాలు బలిగొన్నది. వ్యాధికారకమైన వైరస్ ఫలానా అని నిర్ధారించడానికే కొంతకాలం పట్టింది. వర్షాకాలం ప్రారంభంకాగానే ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రలలోని కొన్నిప్రాంతాలలో అంతుబట్టని విషజ్వరాలు వచ్చి చాలామంది పిల్లలను పొట్టనపెట్టుకున్నవి. అలాంటి జ్వరాల బాధితులను కాపాడడానికి ఇంకా డాక్టర్లు పోరాడుతూనే ఉన్నారు.

ఇలాంటి భయంకర వ్యాధులకు కారణం ఫలానా క్రిములని నిర్ధారించలేకపోయినప్పటికీ - పీల్చే గాలిద్వారా, తాగే నీళ్ళద్వారా, తినే కలుషిత ఆహారం ద్వారానే ఇవి వ్యాపిస్తున్నాయన్నది అక్షరాలా నిజం. అంటే వీటన్నిటికీ మూలకారణం అపరిశుభ్రత! ఇంటా, బయటా పరిశుభ్రతను పాటించగలిగినట్టయితే ఇలాంటి వ్యాధులు చాలామట్టుకు రాకుండా అరికట్టవచ్చు. పరిశుభ్రతను కాపాడుకోవడానికి ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలతోపాటు, వ్యక్తులు కూడా శ్రద్ధవహించాలి. దీనిని గురించి మహాత్మాగాంధీ ఒక సందర్భంలో, "కుటుంబంలోని సభ్యులు తమ ఇళ్ళను శుభ్రంగా ఉంచుకుంటారు తప్ప, పరిసరాలను గురించి పట్టించుకోరు," అని అన్నాడు. పరిసరాలను శుభ్రంగా ఉంచుకోవడం చాలా అవసరం. మనసుంటే ఇది అంత కష్టమైన పనికూడా కాదు.

నిలువవున్న నీళ్ళలోనే కాకుండా, ప్రవహించే కలుషిత జలాలలోనూ కొన్నిరకాల దోమలు గుడ్లు పెడతాయి. చెరువులూ, కొలనులూ, కాలువలూ, నదులూ కలుషితం కావడానికి చాలా వరకు మనుషుల నిర్లక్ష్యం, స్వార్థపూరిత చేతలే కారణాలు. కనుక వాటిని అరికట్టడానికి మనుషులే పూనుకోవాలి. ఇందులో విద్యావంతుల బాధ్యత మరీ గురుతరమైనది!

ఇక్కడ మరొక ముఖ్యవిషయం గుర్తుంచుకోవాలి. పరిసరాల పరిశుభ్రతతోపాటు, అంతరంగశుభ్రత అంటే, మనిషి మనసు, ఆలోచనలు నిర్మలంగా ఉండడం కూడా చాలా అవసరం. ఎందుకంటే మనసులోని మాలిన్యం అన్నిటికన్నా ప్రమాదకరమైనది. మనసు నిర్మలంగా, మనలోని భావాలు స్వచ్ఛంగా ఉంటే బాహ్య పరిశుభ్రత సులభంగా అలవడుతుంది. ఈ విషయం గురించి మహాత్మాగాంధీ ఇలా అన్నాడు: "పరిశుభ్రత పాటించడం అంటే బాహ్య పరిశుభ్రతా, అంతరంగిక పరిశుభ్రతా రెండూ పాటించడం. సత్యమే స్వచ్ఛతసారం. సత్యం నైర్మల్యానికి మరో పేరు."

అందుకే పరిశుభ్రతను దేవుడితో సమానంగా చెబుతారు.

Visit us at : http://www.chandamama.org
సంపాదకుడు : విశ్వం



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 24

మన పురాణాలలోని కొందరు బాలవీరుల గురించి ఇక్కడ ప్రస్తావించాం. వాళ్ళు మీకు తెలుసా?

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!*

1. మా గురువు ధౌమ్యముని పంటపొలాలు మునిగిపోకుండా కాపాడడానికి తెగిన కట్టకు నేనే అడ్డుగా పడుకున్నాను. ఉత్తరోత్తరా నేనూ గొప్ప మునినయ్యాను. నా పేరేమిటి?

--------------------------------------------

2. నేను ఎనిమిది వంకరలతో పుట్టాను. వాగ్వాదంలో వందిమునిని ఓడించి మా తండ్రిని రక్షించాను. నేనెవరో మీకు తెలుసా?

--------------------------------------------



3. ఋచీకముని కుమారుల్లో నేను మధ్యముణ్ణి. విశ్వామిత్రుడు నా పినతండ్రి. భక్తి కారణంగా, బలి ఇవ్వబడడం నుంచి రక్షించ బడ్డాను. నా పేరేమిటి?

--------------------------------------------

4. వేదుడి ఉత్తమశిష్యుణ్ణి. గురుపత్ని కోసం భూగర్భం నుంచి బంగారాన్ని తిరిగి తీసుకు వచ్చాను. నా పేరు మీకు తెలుసా?

--------------------------------------------

5. నేను కురుపాండవుల గురువు కుమారుణ్ణి. విలువిద్యలో ఘటికుడినైన నేను చిరంజీవిని. నా పేరు చెప్పండి చూద్దాం.

--------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన పురాణ బాలవీరుడు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

నా అభిమాన పురాణ బాలవీరుడు:

..................................................................

..................................................................

పాల్గొనేవారి పేరు: ..........................................

వయసు:..............తరగతి: ..........................................

చిరునామా:..................................................................

..................................................................

పిన్: ..............................  ఫోన్: ..............................

పాల్గొనేవారి సంతకం: ........................

తల్లి/తండ్రి సంతకం:........................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2003 అక్టోబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-24
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈక్కాట్టుతాంగల్, చెన్నయ్-600 097.

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు






బాల రచయితలకూ–చిత్రకారులకూ ఆహ్వానం

# పిల్లల ప్రత్యేక సంచిక

(నవంబర్ 2003)

**బాల రచయితలకు:** చక్కని కథలను ఆలోచించి ఐదు వందల పదాలకు మించకుండా రాసి, తగిన పేరు పెట్టి పంపండి. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, బెంగాలీ, ఒరియా, మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు భాషలలో ఏ భాషలోనైనా సరే ఒక్కొక్కరు మూడు ఎంట్రీల వరకు పంపవచ్చు. ఎంపికయిన కథలను, నవంబర్ 2003 పిల్లల ప్రత్యేకసంచికలో ప్రచురిస్తాము.

**బాల చిత్రకారులకు:** సుప్రసిద్ధ పౌరాణిక/చారిత్రక దృశ్యాల్ని (వాటి వివరణతో) చిత్రంగా/వర్ణచిత్రంగా వేసి మాకు పంపాలి. ఎంపికయిన చిత్రకారులను మా ఖర్చులతో చెన్నయ్‌కి రప్పించి, ప్రత్యేక సంచిక కోసం ఎంపికయిన బాలల రచనలకు వాళ్ళచేత చిత్రాలు వేయిస్తాం.

ఎంట్రీలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ: సెప్టెంబర్ 15, 2003.

ఉత్తమ రచనలకు, చిత్రాలకు ఆకర్షణీయమైన బహుమతులు ఉంటాయి!

ఫోటో: మీ ఎంట్రీలతోపాటు మీ పాస్‌పోర్ట్ సైజు ఫోటో ఒకటి జతచేసి పంపండి.

కింది కూపన్‌ను వివరాలతో పూర్తిచేసి, మీ ఎంట్రీకి జతచేసి **పిల్లల ప్రత్యేకసంచిక పోటీ**, చందమామ ఇండియా లిమిటెడ్, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్–600 097 చిరునామాకు పంపండి.

పేరు: .................................... వయసు/పుట్టిన తేదీ : ....................

తరగతి: .................. పాఠశాల : ....................................

ఇంటి చిరునామా : ....................................

....................................

.................................... పిన్‌కోడ్ : ....................

ఎంట్రీల వివరాలు :-

1. ....................................
2. ....................................
3. ....................................

పైన కనబరచిన ఎంట్రీలు, మా అబ్బాయి/అమ్మాయి స్వయంగా మరెవ్వరి సాయం లేకుండా రాసినవి/వేసినవి అని ధ్రువపరుస్తున్నాను. ఎంపికయిన ఎంట్రీలను తెలుగు భాషలోనూ, ఇతర భాషలలోనూ ప్రచురణ మరియు ఎలక్ట్రానిక్ మీడియాలో వాడుకునే పూర్తి కాపీరైట్ చందమామకే చెందుతుందని ఇందుమూలంగా సమ్మతిస్తున్నాను.

పాల్గొనే అబ్బాయి/అమ్మాయి సంతకం

తల్లి/తండ్రి సంతకం

# దళాధిపతి అభిప్రాయం!

సౌవీరదేశాన్ని అనంతవర్మ అనే రాజు పాలించే కాలంలో, ఆయన కొలువులో చంద్రపాలుడనే అశ్వదళాధిపతి వుండేవాడు. సౌవీరదేశానికి అప్పుడప్పుడూ పొరుగు రాజ్యాలతో చిన్నా పెద్ద యుద్ధాలు జరుగుతూండేవి. ఆ యుద్ధాల్లో చంద్రపాలుడు, అశ్వసైనికులతో శత్రువుల మీద దాడి చేయడంలో అమోఘమైన ప్రావీణ్యం కనబరచేవాడు. ఆ కారణంగా, దురాశకొద్దీ సస్యశ్యామలమైన సౌవీరదేశం మీద దాడి చేయడానికి శత్రురాజులు జంకుతూండేవారు.

కాలక్రమాన చంద్రపాలుడు, రాజు కొలువులో వార్థక్యదశకు చేరుకున్నాడు. ఇక తను విశ్రాంతి తీసుకోవడం మేలని భావించిన అతడు, రాజుకు ఆ సంగతి చెప్పి, తనను పదవీ విరమణకు అనుమతించవలసిందిగా కోరాడు. రాజు చేసేది లేక, అతడి కోరికను అంగీకరించ దలచి, ''అవును, చంద్రపాలా! నీ కోరికను కాదనలేను. కానీ, నీ తర్వాత అశ్వదళాన్ని నడపగల సమర్థుడు గౌరీనాథుడనుకుంటున్నాను. అతణ్ణి గురించి, నీ అభిప్రాయమేమిటి?'' అని అడిగాడు.

''గౌరీనాథుడు అందుకు అన్నివిధాలా తగిన సమర్థుడని, నా అభిప్రాయం,'' అన్నాడు చంద్రపాలుడు.

ఆ వెంటనే, రాజుకు సమీపానే వున్న ప్రధానమంత్రి, ''గౌరీనాథుడా! అతడికి నీ పట్ల సదభిప్రాయం లేదే,'' అన్నాడు.

దానికి చంద్రపాలుడు, ''మహారాజుగారు అడిగింది, గౌరీనాథుడి గురించి, నా అభిప్రాయం. నన్ను గురించి, అతడి అభిప్రాయమేమిటో కాదుగదా!'' అన్నాడు.






# మంచితనపు మహత్తు

రామాపురనివాసి అయిన విష్ణుస్వామి, పిల్లలు చిన్నవాళ్ళుగా వుండగానే జమీందారు ప్రాపకం లభించి కృష్ణపట్టణానికి కాపురం మార్చాడు.

ప్రస్తుతం ఆయన కుమార్తెలిద్దరికీ పెళ్ళిళ్ళు కాగా, ఉన్న ఒక్కగానొక్క కొడుకు మాధవస్వామి పెళ్ళీడువాడయ్యాడు. పండితుడూ, దానశీలీ అయిన విష్ణుస్వామి పేరు ప్రతిష్ఠలూ,తండ్రికి మించిన తనయుడిగా మాధవస్వామి పాండిత్యం చూసి అతడికి పిల్లనిస్తామంటూ అనేకులు రాసాగారు.

ఈ స్థితిలో ఒకనాడు విష్ణుస్వామి భార్య అలమేలు కొడుకుతో, ''నాయనా! నీకు పిల్లనిస్తామంటూ ఎంతమంది వస్తున్నారో చూస్తున్నావు గదా! ఇంకా ఆలస్యం చేయకూడదు. ఈ సందర్భంగా నీకొక ముఖ్యవిషయంచెప్పాలి,'' అన్నది.

మాధవుడు, తల్లి మాటలకు కాస్త ఆశ్చర్యపడుతూ, ''ముఖ్యమైన విషయమా! ఏమిటమ్మా అది?'' అంటూ ప్రశ్నించాడు.

''విను,'' అంటూ అలమేలు, ''నీ చిన్నతనంలో మనం రామాపురంలో ఉన్నప్పుడు, మన పొరుగున వెంకటావధాన్లుగారి కుటుంబంవుండేది. ఆయనకు ఐదుగురు ఆడపిల్లలు సంతానం. లక్ష్మీసరస్వతులిద్దరూ ఆయన్ని చిన్నచూపు చూడటం వల్ల, ఆ కుటుంబానికి మేం అడపాదడపా సహాయపడతూ వుండేవాళ్ళం. వాళ్ళ మూడో అమ్మాయి శ్రీలక్ష్మి అప్పటికి ఐదు సంవత్సరాలపిల్ల. చూడముచ్చటైన రూపంతో చురుగ్గా తిరుగుతూండే ఆ పిల్లను నేను, నా కోడలు అంటూ ముద్దుచేసి, మీతో సమానంగా చూసేదాన్ని. చివరికి, ఆ ఊరు నుంచి కృష్ణపట్టణానికి కాపురం మార్చే ముందు, అవధాన్లుగారి భార్య ఊరికే బాధపడుతూంటే ఓదారుస్తూ, శ్రీలక్ష్మిని తప్పకుండా నా కోడల్ని చేసుకుంటాననీ, బాధపడవద్దనీ చెప్పాను. మీ నాన్నగారు కూడా అందుకు సంతోషంగా తన సమ్మతి చెప్పారు. అందుచేత, ఇప్పుడు మిగిలిన పెళ్ళిసంబంధాల గురించి ఆలోచించేముందు,

లక్ష్మీగాయత్రి



ఒకసారి రామాపురం వెళ్ళి పిల్లని చూసి వద్దాం,'' అంటూ ముగించింది.

ఆ తరవాత, తల్లి మాటల్ని నిర్ఘాంత పోతూ విన్న మాధవుడు, కొంతసేపు మౌనంగా ఊరుకుని, ''మాట ఇచ్చిన వాళ్ళు నాతో మీరీమాట ముందుగానైనా చెప్పి వుండ వలసింది!'' అంటూ బాధపడ్డాడు.

అలమేలు, మాధవుణ్ణి సంగతేమిటో చెప్పమని రెండు మూడుసార్లు అడిగిన మీదట, మాధవుడు, ''అమ్మా! మనది విద్వత్కుటుంబం. అందువల్ల, మన ఇంటికి రాబోయే కోడలు కూడా విద్యాంసురాలూ, సుగుణవతీ అయివుండాలన్నది, నా అభిప్రాయం. అందుకే, రామశర్మగారు తన కూతురు శారదను నాకిచ్చి పెళ్ళి చెయ్యాలన్న కోరికతో సూచనప్రాయంగా అడిగినప్పుడు నేనూ అదే ధోరణిలో, నా అంగీకారాన్ని తెలియజేశాను. ఆయన నవరాత్రులు అయిన వెంటనే ఇక్కడికి వచ్చి, మీతో మాట్లాడతానన్నాడు,'' అని చెప్పాడు.

అలమేలు ఆ మాటలు విని నోరు మెదపలేకపోయింది. ఇటీవల రాజధానిలో జరిగిన విద్వత్సభలకు మాధవుడు వెళ్ళివచ్చినప్పటి నుంచి, అతడి నుంచి తరుచు రామశర్మ, శారదల గురించిన ఏదో ఒక ప్రస్తావన వస్తూనే వున్నది.

రామశర్మ రాజాస్థానపండితుడు. ఆయన తన కుమార్తె శారదను విద్వత్తులో తనకు సాటివచ్చేదానిలా చేశాడు. ఆస్థానంలో జరిగిన విద్వత్సభలలో, ఆమె చాలామంది పండితులను, తన శాస్త్రజ్ఞాన, వాక్పటిమలతో ఓడించి, చివరకు మాధవుడి దగ్గర తన ఓటమిని అంగీకరించింది. తన కూతుర్ని ఓడించిన మాధవుణ్ణి, రామశర్మ ప్రత్యేకంగా అభినందిస్తూ, తన ఇంటికి విందుకు ఆహ్వానించాడు!

తల్లి ముఖంలో భావాలు గమనించిన మాధవుడు, ''నేను స్వతంత్రించి ప్రవర్తిస్తున్నానని మీరు అపార్థం చేసుకుంటారేమో అన్న భయంతో, రామశర్మగారు తన కూతురి గురించి ప్రస్తావించిన సంగతి చెప్పలేదమ్మా! అంతేగాని, మీ పట్ల అగౌరవభావం మాత్రం కించిత్తూ లేదు,'' అన్నాడు.

అలమేలు భారంగా నిట్టూర్చి, ''సరే, మొదట ఇదంతా మీ నాన్నగారికి చెప్పనీ. ఆ తర్వాత ఏం చెయ్యాలో ఆయనే నిర్ణయిస్తారు,'' అన్నది.

అయితే, విష్ణుస్వామికూడా, వెంటనే ఏ విషయమూ తేల్చి చెప్పలేని సందిగ్ధావస్థలో

పడ్డాడు. తల్లిదండ్రులిద్దరి మనస్థితీ గమనించిన మాధవుడు చివరకు తనే నిర్ణయం తీసుకుంటూ, తల్లితో, ''అమ్మా! నువ్వు అవధాన్లుగారి కుటుంబానికిచ్చిన విధంగా, నేను, శర్మగారికి మాటేమీ ఇవ్వలేదు. అందుచేత, మనం పెళ్ళి ముందు శ్రీలక్ష్మిని చూసి వద్దాం,'' అన్నాడు.

మంచిరోజు చూసుకుని, ముగ్గురూ కలిసి రామాపురం వెళ్ళారు. హఠాత్తుగా వచ్చిన విష్ణుస్వామి కుటుంబాన్ని చూసి, అవధాన్లు దంపతులు మొదట ఆశ్చర్యపోయినా, తర్వాత వారి రాకలోని ఆంతర్యం తెలుసుకుని చిన్నబోయారు.

ఆ తర్వాత కొంతసేపటికి అవధాన్లు బాధగా, ''విష్ణుస్వామీ! ఏనాడో చేసిన వాగ్దానాన్ని ఇంతగా గుర్తుపెట్టుకుని మీరు వస్తారని, మేం కలలో కూడా అనుకోలేదు. ఇప్పుడు మీ మంచితనానికి తగినవిధంగా కృతజ్ఞత చూపలేనందుకు బాధగా వున్నది. శ్రీలక్ష్మి గనక ఈ క్షణాన మా దగ్గర వుండి వుంటే, మారాలో చనలేకుండా కాళ్ళు కడిగి కన్యాదానం చేసి వుండేవాళ్ళం!'' అన్నాడు.

ఈ జవాబు వింటూనే విష్ణుస్వామి, ''ఏమైంది శ్రీలక్ష్మి?'' అన్నాడు ఎంతగానో ఆదుర్దా పడుతూ.

దానికి అవధాన్లు, ''మీరు కృష్ణపట్నానికి వెళ్ళి పోయిన నెల రోజులకు, నిస్సంతు అయిన ఒక పండితుడు సంతానార్థం, ఇక్కడి రంగనాథస్వామిని దర్శించుకోవాలని భార్యతో పాటు వచ్చాడు. అది మండు వేసవికాలం. ఆ పండితుడూ, భార్యా స్వామి



దర్శనం ముగించుకుని ఆలయం నుంచి తిరిగి వస్తూ, ఎండ తీవ్రతకు డస్సిపోయి విశ్రాంతి కోసం ఇంటి వీధి అరుగులమీద వేపచెట్టు నీడలో కూర్చున్నారు. ఇంటి నడవాలో వుండి అది గమనించిన నేనూ, శ్రీలక్ష్మి వాళ్ళను లోపలికి రమ్మని పిలిచేంతలో, బాగా అలసిపోయిన పండితుడి భార్య మూలుగుతూ సొమ్మసిల్లి పడిపోయింది.

''ఆ మరుక్షణం నేనూ, నా భార్యా, శ్రీదేవీ – ఆ పండితుడి సాయంతో ఆమెను ఇంట్లోకి చేతుల మీద మోసుకువచ్చాం. ఆ తర్వాత మన ఊరి ఘనవైద్యుడు వెంకటాచారి వారం రోజులపాటు చేసిన చికిత్సా, పెద్దవాళ్ళం మా అందరికన్నా ఎక్కువగా శ్రీలక్ష్మి చేసిన సపర్యలద్వారా పండితుడి భార్య స్వస్థురాలైంది. ఆ తర్వాత తాపీగా ఒక కుటుంబాన్ని గురించిన

వివరాలు రెండవ కుటుంబంవాళ్ళం తెలుసు కున్నాం,'' అని ఆగాడు.

''అంతా బావున్నది, అవధాన్లూ! ముందా లక్ష్మి సంగతి నాన్చక ఒక మాటలో చెప్పు,'' అన్నాడు విష్ణుస్వామి.

''అదే చెప్ప వస్తున్నాను. ఆ పండితుడు శ్రీలక్ష్మిని దగ్గరకు తీసుకుని ఆప్యాయంగా తల నిమురుతూ, 'సంతానార్థం వేడుకునేం దుకువచ్చిన మాకు, ఏకంగా సర్వగుణ సంపన్నురాలయిన ఆరేళ్ళ కుమార్తెను రంగ నాథుడు ప్రసాదించాడేమో అన్నభావం నా చిన్నబుద్ధికి తోస్తున్నది. ఈ చిట్టి తల్లిని మాకెందుకు దత్తు ఇవ్వగూడదు!' అంటూ ఆ పండితుడు కళ్ళనీళ్ళపర్యంతమైపోతూ కోరాడు. సరే, పిల్లబతుకు బాగుంటుంది కదా అనుకుని గుండె రాయి చేసుకుని శ్రీలక్ష్మిని వారికి దత్తత ఇచ్చేశాం,''అన్నాడు.

''శ్రీలక్ష్మిని దత్తు తీసుకున్న పండితుడి పేరేమిటి?'' అంటూ విష్ణుస్వామీ, మాధవుడూ ఒకేసారి ప్రశ్నించారు.

అందుకు అవధాన్లు, ''ఆయన పేరు రామశర్మ. లక్ష్మిని దత్తు తీసుకున్నాక ఆయ నకు రాజాదరణ లభించింది. దత్తత తీసుకునే సమయంలో ఆయన పిల్లపేరును తన అభిరుచి ప్రకారం లక్ష్మిశారదగా మార్చు కున్నాడు,'' అని చెప్పాడు.

తను మాట ముగించే లోపలే విష్ణుస్వామీ, భార్యా, కుమారుడూ ఎందుకంతగా ఆనంద పడిపోతున్నారో తెలియక, మొదట ఆశ్చర్య పోయాడు అవధాన్లు. కానీ తర్వాత విష్ణుస్వామి ద్వారా సంగతి సందర్భాలన్నీ క్షుణ్ణంగా తెలు సుకుని, ఒక్క అవధాన్లేకాక ఆయన కుటుంబం యావన్మందీ చాలా సంతోషించారు.

ఇది జరిగినరెండు నెలలకు, నూతనదంప తులైన శారదనూ, మాధవుణ్ణీ ఆశీర్వదిస్తూ రామశర్మ, విష్ణుస్వామితో, ''చూశారా, బావ గారూ! మంచిమనసుతో మనిషి చేసే పను లకు ఎంతటి మహత్తున్నదో! ఆ రంగనాథుడే, మీరు ఏనాడో వదిలిపోయిన రామాపురానికి మాచేత ప్రయాణం కట్టించి, ఇటు మా చెల్లెలు అలమేలు కోరికా, అటు మాధవుడి జీవితాశ యం-అన్నీ చక్కగా నెరవేరేలా చేశాడు. మంచి తనపు మహత్తు అంటే ఇదీ!'' అన్నాడు అమితానందంతో.





# మాయాసరోవరం

## 20

[జయశీలుణ్ణి, మాయాసరోవరేశ్వరుడు తనవెంట తీసుకుపోతున్నాడని తెలిసి, సిద్ధసాధకుడు బయలుదేరబోతున్న సమయంలో, జలవృకరాక్షసులను గురించిన వార్త వారికి చేరింది. రాజు కనకాక్షుడూ, సాధకుడూ వెళ్ళేసరికి జలవృకులతో ఘర్షణపడుతున్న దేవశర్మా, ఇతరులూ కనిపించారు. పారిపోతున్న జలవృకులను నరభక్షకులు వెంటబడి తరమసాగారు. -తరువాత]

తమ ఆకలి తీర్చుకునేందుకు, జలవృక రాక్షసుల్లో ఏ ఒకరిద్దరినైనా పట్టుకోవాలనే ఉత్సాహంలో, నరభక్షకులు పరిగెత్తుతున్నారే తప్ప, రాక్షసులు తమను ఏ మార్గాన తీసుకుపోతున్నదీ వాళ్ళు గమనించటం లేదు. ఆ సమయంలో ఇద్దరు జలవృకులు గుబురుగావున్న ఒక ఎత్తయిన చెట్టుకొమ్మల్లో దాగివుండి, ఈ జరుగుతున్నదంతా గమనిస్తూనే వున్నారు. వాళ్ళు, తమ రాజైన జలవృకనాథుడు పంపగా, ఉదయం నుంచి ఆ ప్రాంతాల వేగు కాస్తున్నారు.

చెట్టుమీది జలవృకరాక్షసుల్లో ఒకడు, తన పక్కనున్నవాడితో, ''ఒరే, మన రాజుకు శత్రుబలం ఎంత పెద్దదో తెలిసినట్టు లేదు. ఇంతకుముందు సరోవరంలో జరిగిన యుద్ధంలో, ఆ మాయాసరోవరం రాజు బంట్లనందర్నీ, తన్ని తరిమేశాం గాని, అతడికి మరికొందరు సాయం వస్తున్నట్టున్నది!'' అన్నాడు. రెండో జలవృకరాక్షసుడు, మొదటివాడు ఇంత మాట్లాడినా, వినిపించుకున్నట్టే లేదు. వాడి దృష్టి, మాయాసరోవరం కేసి పారిపోతున్న తన జాతివాళ్ళమీదా, వెనక



రానిరహస్యం అంటూ ఏమీ లేదు. నేను ఈ సొట్టవెధవను భుజాన వేసుకుపోయి మన రాజుగారికి ఒప్పచెబుతాను,'' అంటూ మొదటి జలవృకరాక్షసుడు, చెట్ల కొమ్మల్లోంచి దిగి, మంగళవర్మకు వెనకగా నడవసాగాడు.

మంగళవర్మ తనకు రానున్న ప్రమాదాన్ని గురించి శంకించే స్థితిలో లేడు. కాళ్ళున్న వాళ్ళూ, గుర్రాలున్నవాళ్ళూ, హడావిడిలో తన మాట మరిచి, మాయాసరోవరం కేసి పోతున్నారు. తాను వెనకబడిపోయాడు! సాధ్యమైనంత త్వరగా సరోవరాన్ని చేరి, అక్కడ జలవృకరాక్షసులతో జరగబోయే యుద్ధంలో తనూ తప్పక పాల్గొనాలి. ఒక మనిషి వీరుడవునో కాదో నిర్ణయించేది కాలూ, కత్తీ కాదు; గుండెబలం!

మంగళవర్మ ఇలా ఆలోచిస్తూ పోతున్నంతలో, వెనక నుంచి పెద్ద చప్పుడై, అతడు చప్పున తల తిప్పి చూశాడు. జలవృకరాక్షసుడు అతణ్ణి వెనకనుంచి హఠాత్తుగా మీదపడి పట్టుకుందామనే ఆదుర్దాలో, తను నడుస్తున్న దారి ఎలా వున్నదో చూసుకోకపోవటంతో, వాడి కుడి కాలు లోతైన ఒక నెర్రెలో పడగానే, వాడు ముందుకు తూలటంతో రాతిగద పోయి దూరంగా పడింది. వాడు నిశ్శబ్దంగా కాలును బయటికి లాక్కుందామని ప్రయత్నించాడు గాని, వాడుపడ్డ పాటుకు అది మోకాలిదగ్గిర బెణికిపోయింది. జలవృకరాక్షసుడు బాధతో గొంతెత్తి, ''హా, జలవృకనాథా, నువ్వే శరణ్యం!'' అంటూ పెద్దగా అరిచాడు.

మంగళవర్మకు తనకు ఎంత స్వల్పంలో ప్రమాదం తప్పిపోయిందో అర్థమైంది. అతడు జలవృకుడి దగ్గిరకుపోయి, ''ఒరే, నన్ను

వస్తున్న నరభక్షకులమీదే కాక, మరికొంచెం దూరంలో కొయ్యకాలుతో కుంటుతూ, చేతి కర్ర ఊతంతో నడిచివస్తున్న, హిరణ్యపుర సేనాని కొడుకు మంగళవర్మ మీద వున్నది.

జలవృకుడు తన తోటివాడికి కుంటి మంగళవర్మను చూపుతూ, ''ఒరే, వీణ్ణి పట్టుకుపోయి మనరాజుగారి ముందు పెడితే ఎలా వుంటుందంటావు? వీడి నుంచి, కొత్తగా ఈ అరణ్యానికొచ్చిన రాజు వెంట ఎంత బలగం వున్నదో తెలుసుకోవచ్చు,'' అన్నాడు.

''అది బాగానేవుందిగాని, మరి రెండు గుంపులై, మాయాసరోవరం కేసి పోతున్న శత్రువుల మాటేమిటి? వాళ్ళను ఒక కంట కనిపెట్టి వుండి, వాళ్ళు ఏం చేయబోతున్నారో మనరాజును ముందుగా హెచ్చరించవద్దా?'' అన్నాడు రెండో జలవృకుడు.

''ఆ పనేదో నువ్వు చూడు. వాళ్ళు పోతున్నది మాయాసరోవరంకేసి. అందులో తెలియ

పట్టుకోబోయి నువ్వు కాలు విరగ్గొట్టుకున్నావు, మంచి శాస్తే జరిగింది. ఇప్పుడు నీక్కావలసింది వైద్యసహాయం. ఎక్కడో వున్న మీ రాజు జలవృకనాథుడు నీకు చేయగలిగిందేమీ లేదు. ఇంతకుపూర్వం మీ జలరాక్షసులు, సరోవరేశ్వరుడి భవనాలమీద దాడిచేశారుగదా? అందులో ఎవరుగెలిచారు? నిజం చెపితే, సంజీవిలాంటి మూలికలతో నీ విరిగిన కాలుకు కట్టుకట్టి, నడిచేలా చేస్తాను,'' అన్నాడు.

ఆ మాటలకు జలవృకుడు మూలుగుతూ జవాబివ్వబోయేంతలో, చెట్టు కొమ్మల్లో వుండి ఇదంతా చూసిన జలవృకుడి తోటి వాడు, రాతిగదను పైకెత్తి పట్టుకుని కేకలు పెడుతూ, ''ఒరే, మాయాసరోవరేశ్వరుడి బంటూ! నిన్నీ క్షణంలోనే, ఈ లోకం నుంచి ప్రయాణం కట్టిస్తాను,'' అంటూ వేగంగా రాసాగాడు.

మంగళవర్మ మెరుపు వేగంతో తన ఊత కర్ర పిడిని పట్టుకుని పైకి గుంజాడు. లోపలి నుంచి తళతళ మెరుస్తున్న పదునైన కత్తి బయటికి వచ్చింది. అతడు, ఆ కత్తిని కాలు విరుచుకున్న జలవృకరాక్షసుడి కంఠం మీద పెట్టి, తనను సమీపిస్తున్న జలవృకుడితో, ''ఒరే, నేను ఒకటి నుంచి మూడు అని పలికే లోపల నువ్వు రాతిగదను దూరంగా పారేసి, మోకాళ్ళమీద పాకుతూ నన్ను సమీపించాలి. అలా చేయకపోయావో ముందు నీ నేస్తగాడి తల తెగిపోతుంది. తరవాత నీ వంతు! ఇదిగో, ఒకటి, రెండు...'' అన్నాడు.

మంగళవర్మ మూడు అనే లోపల జలవృకుడు రాతిగదను దూరంగా విసిరి, మోకాళ్ళనూ, చేతులనూ నేలమీద ఆనించి, ''లొంగి



పోయాను. నా మిత్రుణ్ణి చంపకు!'' అన్నాడు వణికిపోతూ.

''ఒరే, నీటితోడేలు వెధవ్వాయినా, నీ స్నేహధర్మం మెచ్చదగింది. నా వెంటరా నీకు ఓషధీపత్రాలు చూపుతాను,'' అంటూ మంగళవర్మ, దాపుల్లో చిత్త ఒత్తుగా పెరిగిన పొదలూ, చిన్నచిన్న మొక్కల్లోకి దారితీశాడు. మంగళవర్మ అక్కడ కొన్ని పండుటాకులూ, చిగుళ్ళూ కోసి, వాటిని అరచేతుల్లో మర్దించి, ఉండచేసి, దాన్ని జలవృకరాక్షసుడికి ఇస్తూ, ''ఒరే, ఈ ఔషధాన్ని నీ మిత్రుడి మోకాలికి అంటించి, కట్టు కట్టు. వాడు ఉన్నచోటనే కనీసం పన్నెండు గంటల పాటు కదలకుండా వుండాలి. అలా చేయక పోయాడో, మోకాలు వరకూ తెగనరకవలసి వస్తుంది,'' అన్నాడు.

ఆ మాటలకు జలవృకరాక్షసులిద్దరూ ఏడ్పు ముఖాలు పెట్టారు. వాళ్ళు అరణ్యంలో ఏదో ముఖ్యమైన పనిమీదే తిరుగుతున్నా



రనీ, అడిగినా నిజం చెప్పరనీ అనుకుంటూ మంగళవర్మ ముందుకు కదిలాడు. అతడు కొంతకాలంపాటు మాయాసరోవరంలో నివసించినవాడు. అతడికి అక్కడికి వెళ్ళేందుకు దగ్గర దారి ఏదో తెలుసు. కాని, కొయ్యకాలుతో, ఎత్తుపల్లాలుగా వున్న నేలమీద నడవటం అతడికి చాలా ప్రయాసగా వున్నది.

మంగళవర్మ అలా కుంటుతూ, నాలుగైదు నిమిషాలకాలం నడిచేరికి, అతడికి ఒక ఎత్తయిన చెట్టుమీది నుంచి, ''మంగళవర్మా!'' అన్న పిలుపు వినిపించింది.

ఇదేరకం వృక్షపిశాచి, అనుకుంటూ అతడు తలఎత్తి చూశాడు. కొమ్మలమీద, అల్లిబిల్లిగా వున్న అడవితీగలలో చిక్కుకుని, ఒక మనిషి అతడికి కనిపించాడు. వాడు మాయాసరోవరేశ్వరుడి హంసలరథం తోలేవాడు. ఆ రథం ఆకాశంలో తలకిందులైనప్పుడు, వాడు దానిలో నుంచి జారి, ఆ చెట్టుపైగల అడవి తీగల్లో చిక్కుకుపోయి, చావు తప్పుకున్నాడు.

''ఓహో, నువ్వు బతికే వున్నావన్నమాట! చాలా సంతోషం. కిందికి దిగి రావటానికి, దాపుల్లో ఏదైనా కొమ్మ ఊతం దొరకలేదా?'' అన్నాడు మంగళవర్మ.

హంసలరథం తోలేవాడు అవునన్నట్టు తల వూపి, ''వర్మా కొంచెం మెల్లగా మాట్లాడు. యమకింకరుడిలాటి వాడొకడు భయంకరమైన నరవానరాన్ని ఎక్కి, ఈ మార్గానే వస్తున్నాడు. అతడివెంట కొందరు సైనికులు కూడా వున్నారు. వీళ్ళు మన శత్రువులైన జయశీలుడూ, సాధకుడూ అనుకుంటాను,'' అన్నాడు.

మంగళవర్మకు ఆ మాటలు వింటూనే ఉత్సాహం కలిగింది. ఆ వచ్చేవాళ్ళలో వైద్య దేవుడని పిలవబడే దేవశర్మ కూడా వుంటాడు. ఇప్పుడు వాళ్ళతో కలిసి, సాధ్యమైనంత త్వరగా మాయాసరోవరాన్ని చేరవచ్చు!

''ఒరే, బాబూ, ఇప్పుడు వాళ్ళుమనకు శత్రువులు కారు; కాని మిత్రులవునో కాదో మాత్రం నాకు తెలియదు. మాయాసరోవరేశ్వరుడు, ఆ జయశీలుడనే అతన్ని పట్టుకుని, సరోవరం కేసి వెళ్ళాడని తెలిసింది.ఇక ఇప్పుడు నువ్వు చెప్పే వీళ్ళలో మనవాడైన వైద్యదేవుడున్నాడు; నేను ఒంటి కాలివాణ్ణి, చెట్టెక్కలేను. నువ్వు దిగలేవు. ఆ వచ్చేవాళ్ళను చప్పట్లు చరిచి పిలువు,'' అన్నాడు మంగళవర్మ.

వైద్యదేవుడు,ఆ నరవానరం ఎక్కి వచ్చేవాడి వెంట వున్నాడని తెలియగానే రథం తోలేవాడికి ప్రాణం లేచి వచ్చింది. తను మరికొద్దికాలం అలా చెట్టుకొమ్మల్లో చిక్కుకుపోయి వుంటే, ఏ నరభక్షకులో, జలవృకరాక్షసులో తనను హతమార్చి వుండేవాళ్ళు!

రథంతోలేవాడు, తానున్న చెట్టుకు కొంచెం దూరంగా పోతున్న సిద్ధసాధకుడూ, రాజు కనకాక్షుడూ, అతడి వెంట వున్నవాళ్ళనూ ఉద్దేశించి, పెద్ద గొంతుతో, ''అయ్యాలారా, నన్ను రక్షించండి! ఇక్కడ చెట్టు చిటారు కొమ్మల్లోని, అడవి తీగల్లో చిక్కుబడిపో యాను,'' అంటూ అరిచాడు.

అంతదూరం నుంచి వచ్చిన ఆ కేకను ముందుగా తన వాడిచెవులతో నరవానరం విన్నది. ఆ వెంటనే అది ఆగి, తలెత్తి చూస్తూ, భుజాలమీద వున్న సిద్ధసాధకుడికి సౌంజ్ఞ చేసింది. అంతలో రథం తోలేవాడు, మరొక సారి పెద్దగా కేకపెట్టాడు.

ఈసారి వాడి కేకను అందరూ స్పష్టంగా విన్నారు. దేవశర్మ ముందుకు వచ్చి, ''ఆ గొంతు మాయాసరోవరేశ్వరుడి రథం తోలే వాడిదిలా వున్నది. వాడు హంసలరథంలోంచి, ఈ ప్రాంతాలే కిందపడిపోయాడు,'' అన్నాడు.

''ఆహా, వాణ్ణి దొరకపుచ్చుకుని, వాడి యజమాని ఆ నీటిపక్షిగాడి రహస్యాలన్నీ బయటికి లాగుతాను. జయశీలుడు కంట బడిం తరవాత, గుంపునంతా చెట్లకు కట్టి, మహాకాలుడికి బలి ఇస్తాను,'' అంటూ సిద్ధ సాధకుడు, నరవానరాన్ని గట్టిగా అదిలించాడు.

నరవానరం వేగంగా పరిగెత్తుతూ వచ్చి, రథంతోలేవాడున్న చెట్టుకింద ఆగింది. మంగళవర్మ సాధకుడి ముందుకు పోయి, ''సాధకా, నువ్వు చెట్లకొమ్మల్లో చిక్కుకు పోయిన మావాణ్ణి కిందకు దించాలి. అదెలా సాధ్యం అంటావు?''అన్నాడు.

సిద్ధసాధకుడు, ''జై, మహాకాళా!'' అంటూ కేకపెట్టి,''అంతా నాకు అయోమ యంగా వున్నది. మాయాసరోవరేశ్వరు డనేవాడు, కనకాక్షరాజుగారి పిల్లల్ని అపహ రించుకుపోవటమేగాక, ఇప్పుడు నా మిత్రు డైన జయశీలుణ్ణి కూడా పట్టుకుపోయాడు.



ఆ దుర్మార్గుణ్ణి ఎరిగిన మీరేమో, వాణ్ణి మిత్రుడన్నట్టు మాట్లాడుతున్నారు,'' అన్నాడు.

దేవశర్మ అతణ్ణి శాంతపరుస్తూ, ''సాధకా, ఇప్పుడు మనకూ, ఆ మాయాసరోవరేశ్వరుడికీ–అందరికీ ప్రమాదకరమైన శత్రువులు, సరోవరంలోని మరొక ప్రాంతాన నివసించే జలవృకరాక్షసులు. అందరం కలిసి వాళ్ళను నాశనం చేస్తే తప్ప, కనకాక్షరాజుగారి పిల్లల్ని రక్షించే అవకాశం వుండదు. ఇప్పుడా సరోవరం జలవృకుల చేతుల్లో వుందని నా అనుమానం,'' అన్నాడు. అంతలో అక్కడికి కనకాక్షరాజు కొందరు సైనికులతో వచ్చాడు.

''అయ్యలారా, నా మాటేమిటి? పెద్ద కొండచిలువ ఒకటి, కొమ్మలమీద పాకుతూ, నాకేసి వస్తున్నది!'' అంటూ రథం తోలేవాడు భీతితో పెద్దగా అరిచాడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు, నరవానరం వీపు చరిచి, చేయెత్తి చూపుతూ, ''ఆ చెట్టు కొమ్మల్లోని అడవి తీగల్లో చిక్కుకుపోయిన వాణ్ణి, పోయి కిందికి తీసుకురా,'' అని ఆజ్ఞాపించాడు.

నరవానరం చప్పున కదిలి, మెరుపు వేగంతో చెట్టు చిటారు కొమ్మల్లోకి పోయి, ఒక చేత్తో రథంతోలేవాణ్ణి సమీపిస్తున్న కొండచిలువను వడిసి పట్టుకుని, రెండవ చేత్తో రథంవాణ్ణి, అడవి తీగల నుంచి బయటికి లాగింది. వాడు, వానరాన్ని చూసి గడగడలాడిపోతూ, ఒక బలమైన కొమ్మ పట్టుకుని, ''ఇక నన్ను వదులు, కిందికి దిగి రాగలను!'' అన్నాడు.

అంతలో హఠాత్తుగా జలవృకరాక్షసుల గుంపొకటి రాతిగదలెత్తి, అక్కడికి పరిగెత్తుకుని వస్తూ, ''జై, జలవృకనాధుడికీ!'' అంటూ వాళ్ళమీద పడ్డారు.

జలరాక్షసుల్లో ఖడ్గమృగం మీద ఎక్కి వున్న వాడొకడు రాతిగదను గిరగిరా తిప్పుతూ, ''శత్రువుల్లో ఒక్కగానొక్కడైనా ప్రాణాలతో పారిపోగూడదు,'' అంటూ జలవృకుల్ని హెచ్చరించాడు.

చెట్టుకొమ్మల్లోవుండి ఇది చూసిన నరవానరం, అరణ్యం దద్దరిల్లేలా ఒక కేకపెట్టి, చేతిలో చిక్కిన కొండచిలువను చర్నాకోల్లా ఠపీమంటూ మోగించి, అంత ఎత్తునుంచి ఖడ్గమృగం ఎక్కివున్న జలరాక్షసుడి మీదికి సూటిగా దూకింది.

– (ముగింపు రాబోయే సంచికలో)



బేతాళ కథలు

# ధైర్యవంతుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, మొక్కవోని ధైర్య సాహసాలతో, ఎన్నో కఠోర శ్రమలకోర్చి, భయంకరమైన ఈ శ్మశానంలో రాత్రి వేళ తిరుగాడుతూ నువ్వు ఎలాంటి కార్యాన్ని సాధించదలచావో తెలియదు. కానీ, ఒక భయంకరుడైన రాక్షసుడి బాధ తప్పించి, దేశానికి మేలు చేసిన ఒకానొక తెలివిమంతుణ్ణి, మహేంద్ర గిరి రాకుమారి ఆడినమాట తప్పి వివాహమాడ నిరాకరించింది. నీకూ కార్యం సాధించాక, అలాంటి ఆశా భంగమే ఎదురుకావచ్చు. నువ్వు తగి నంత అప్రమత్తుడుగా వుండేందుకు,



ఆ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

ఒకానొకప్పుడు మహేంద్రగిరిని, మధుసూదనుడనే రాజు పరిపాలించేవాడు. ఆయన ఒక్కగానొక్క కూతురు మాధవికి, సాహసికులంటే ఇష్టం. తాను మెచ్చగలిగేటంత ధైర్యం ప్రదర్శించిన యువకుడుంటే, అతణ్ణి పేదవాడైనా, చదువురానివాడైనాసరే-పెళ్ళి చేసుకుంటానని ఆమె అంటూండేది.

ఈ విషయం ఆనోటా ఈనోటా పడి రాజ్యమంతటా పాకింది. ఎందరో యువకులు మాధవిని పెళ్ళాడాలన్న కోరికతో, ఎంతో ఉత్సాహంగా సాహసకార్యాలకు పూనుకోసాగారు. ఒకడు వెయ్యడుగుల కొండ ఎక్కి శిఖరం మీది నుంచి కిందకు దూకి గాలిలో పల్లటీలు కొడుతూ, ఒంటికి చిన్నదెబ్బ కూడా తగలకుండా నేలమీదకు చేరుకున్నాడు. ఒకడు భీకరమైన తుఫాను సమయంలో తెప్పమీద నడిసముద్రంలోకి వెళ్ళి, అక్కడి నుంచి ఈదుకుంటూ ఒడ్డు చేరుకున్నాడు. ఒకడు అడవిలోకి ఉత్తచేతులతో వెళ్ళి, అక్కడ ఒక ఎలుగుబంటును లొంగదీసి, దానిమీద సవారీ చేస్తూ నగరంలోకి వచ్చాడు.

ఇలా చాలామంది చాలావిధాలుగా తమ ధైర్యాన్ని నిరూపించుకున్నారు. కానీ రాజకుమారి వారితో, ''మీ ధైర్యం మీకు పేరు తెచ్చిపెట్టిందే తప్ప, దానివల్ల ఇతరులకు కలిగే ప్రయోజనం ఏమీలేదు,'' అని చెప్పి బంగారుకాసులిచ్చి సత్కరించి పంపింది.

ఇలా వుండగా-మహేంద్రగిరి పొలిమేరలో రాక్షసుడొకడు ప్రవేశించి, ఒక పెద్ద ఊడలమర్రి చెట్టుకింద నివాసం ఏర్పరుచుకున్నాడు. వాడికి దారిలో వెళుతున్న శివుడు, శంకరుడు అనే మిత్రులిద్దరు దొరికిపోయారు. రాక్షసుడు వాళ్ళతో, ''నేను రాక్షసుణ్ణేకాని, నాకు శాకాహారమంటేనే ఇష్టం. మీలో ఒకణ్ణి, నా దగ్గర వుంచుకుంటాను. రెండోవాడు నగరంలోకి వెళ్ళి, నాకు సరిపడ ఆహారం తెచ్చిపెట్టాలి. అందుకు ఒకే ఒకరోజు గడువు. గడువులోగా నాకు ఆహారం దొరక్కపోతే, ఏదోవిధంగా ఆకలిని చల్లార్చుకోవాలిగనక, నా దగ్గరున్న వాణ్ణి నమిలి మింగేస్తాను,'' అని చెప్పాడు.

ఆ ప్రకారం శంకరుడు రాక్షసుడివద్ద వుండిపోయాడు. శివుడు నగర పరిసరాల్లో వున్న తన ఊరుకు వెళ్ళి, సంగతి అందరికీచెప్పి రాక్షసుడికి సరిపడ తిండిని ఒక బండి మీద వేయించి రాక్షసుడి వద్దకు తీసుకువెళ్ళాడు.

అందుకు రాక్షసుడు చాలా సంతోషించి శంకరుణ్ణి విడిచిపెడుతూ, 'నేనిక్కడ వున్నానని మీ రాజుకు చెప్పి, ప్రతిరోజూ ఇదేవిధంగా ఆహారం పంపమనండి. ఏరోజు వేళకు ఆహారం

నాకు అందదో, ఆ రోజు మీ రాజ్యం మీద పడి సర్వనాశనం చేస్తాను,'' అని హెచ్చరించాడు.

ఈ వార్త రాజును చేరింది. ఆయన సైన్యంతో రాక్షసుడిమీద యుద్ధానికి వెళ్ళాలనుకున్నాడు. మాధవి తండ్రిని నివారించి, ''రాక్షసుడు శాకాహారికావడం విచిత్రంగా వుంది. ఈ రాక్షసుడి రహస్యం తెలుసుకునేందుకు ధైర్యం కావాలి. ఇది ధైర్యవంతులకు పరీక్షగా ప్రకటించండి. ఈ లోపల రాక్షసుడు కోరినట్టు ఆహారం పంపుతూండండి,'' అని చెప్పింది.

మధుసూదనుడు, కూతురు చెప్పినట్టు చాటింపు వేయించాడు. అది విన్న సాహసిక యువకులు, రాక్షసుడి దగ్గరకుపోయి మాట్లాడారు. వాడు వాళ్ళతో, 'నేను శాపవశాన రాక్షసుడినైన దేవతను. నా శాపం తీర్చడం సామాన్యులకు సాధ్యం కాదు. మహేంద్రగిరి నగరానికి ఉత్తరానవున్న కొండల్లో పాడుపడిన విష్ణాలయం ఒకటున్నది. ఆ ఆలయంలో సొరంగమార్గమున్నది. ఆ సొరంగ మార్గంలో తేళ్ళూ, జెర్రులూ, విషసర్పాలూ వుంటాయి. వాటిని దాటి ముందుకు వెళితే అగ్నిగుండ మొకటున్నది. అందులోకి దూకితే సరాసరి పాతాళం చేరుకుని, అక్కడ ఒక పెద్ద కొండ చిలువకు ఎదురుపడతారు. అది కనబడిన మనిషిని మింగకుండా విడిచిపెట్టదు. దాని కడుపులో ఒక ఉంగరమున్నది. ఆ ఉంగరం తెచ్చి నా బొటనవేలికి తొడిగితే, నాకు శాప విమోచనమవుతుంది!'' అన్నాడు.

ఈ కథ వింటూనే కొందరు సాహసికులు వెనక్కు తగ్గారు. కొందరు విష్ణాలయంలోని సొరంగందాకా వెళ్ళి వెనుదిరిగారు. ఒకడు సొరంగంలోకి ప్రవేశించి విషసర్పాల బుసలు



విని పరుగు పరుగున వెనక్కు వచ్చాడు. ఒకడు మాత్రం ధైర్యంగా లోపలకు వెళ్ళాడు కానీ కొద్ది క్షణాలలోనే వాడి ఆర్తనాదం వినిపించింది. కాసేపటికి ఎవరో విసిరేసినట్టుగా వాడి శవం బయటికి వచ్చి పడింది.

ఇలాంటి సమయంలో మహేంద్రగిరిలోనే సత్యవంతుడనే పేద యువకుడుంటున్నాడు. వాడు సకల శాస్త్రాలూ చదివాడుకానీ చొరవ లేక, వాడి జ్ఞానానికి గుర్తింపు రాలేదు. కాయ కష్టం చేసుకుని బ్రతుకుతున్న వాడికి, చీకటి అంటే భయం. దయ్యాలంటే భయం. ఎవ్వరైనా తనమీదికి పోట్లాటకు వస్తే భయం. అంతా వాణ్ణి మహాపిరికివాడని చెప్పుకునేవారు.

ఈ సత్యవంతుడికి అనుకోకుండా జయద్రధుడనే యువకుడు పరిచయమయ్యాడు. వాస్తవమేమంటే, జయద్రధుడే సత్యవంతుణ్ణి వెతుక్కుంటూ వచ్చాడు.

జయద్రధుడు రాజవంశీకుడు. మాధవిని పెళ్ళాడ్డం కోసం సాహసకార్యాలు చేయడం



సమక్షంలో నీ తాయెత్తు నీలంగా మారుతుందో, అతడి చేతికి దీన్ని కట్టు. అప్పుడది ఆకుపచ్చగా మారితే, రాక్షసుడి పీడ వదిలించేందుకు అతణ్ణి వినియోగించు. ఈ మొత్తం జరగనున్నదానివల్ల, నీవెలా లాభపడాలో నీవే నిర్ణయించుకో!'' అని చెప్పాడు.

ఆ విధంగా సత్యవంతుడి సమక్షంలో జయద్రధుడి చేతికున్న తాయెత్తు నీలంగా మారింది. వెంటనే అతడు సత్యవంతుడికి జరిగినదంతా చెప్పాడు.

ఇది విని సత్యవంతుడు హడలిపోయి, ''అదా సంగతి! మరి నాకు పాములంటే భయం. నిప్పంటే భయం. కొండచిలువను తలుచుకుంటేనే, నా గుండె ఆగిపోతుంది. నేను పరమ పిరికివాణ్ణి. ఇలాంటి పనులు నేను చేయలేను,'' అన్నాడు.

జయద్రధుడు నవ్వుతూ, ''సరే, ముందు నీ చేతికి తాయెత్తు కట్టి చూడనీ. అది ఆకుపచ్చగా మారితేనే, నీవల్ల ఈ సాహసకార్యాలన్నీ నెరవేరుతాయి,'' అన్నాడు.

అతడు, సత్యవంతుడి చేతికి తాయెత్తు కట్టగానే అది ఆకుపచ్చగా మారిపోయేసరికి, సత్యవంతుడే ఆశ్చర్యపోయాడు.

అప్పుడు జయద్రధుడు, సత్యవంతుణ్ణి ఒప్పించడానికి, సామ దాన భేద దండోపాయాలు నాలుగూ ఉపయోగించాడు. మహేంద్రగిరిదేశ భవిష్యత్తు సత్యవంతుడి మీదనే ఆధారపడి వున్నదన్నాడు. ఈ పని చేస్తే జీవిత కాలానికి సరిపడా కావలసినంత డబ్బు ఇస్తానన్నాడు. తన చేత అయుండీ ప్రజలకు సాయం చేయడం లేదని రాజుకు చెబుతానన్నాడు. లేదా తనే అతణ్ణి చంపేస్తానని,

తనవల్ల కాదని తెలుసుకాబట్టి, అందుకు మంత్రశక్తుల్నే ఆశ్రయించాలనుకుని ప్రసిద్ధుడైన ఒక సిద్ధయోగివద్దకు వెళ్ళాడు. సిద్ధయోగి, జయద్రధుడి కోరిక విని, ''నా దగ్గర ఒక తాయెత్తు వున్నది. అది చేతికి కట్టుకుంటే మూడు ప్రమాదాల నుంచి సులభంగా తప్పించుకునే శక్తి వస్తుంది. ఐతే, ఆ తాయెత్తు అందరికీ ఉపయోగపడదు. చేతికి కట్టగానే దాని రంగు ఆకుపచ్చగా మారితే అది నీకు ఉపయోగపడుతుంది!'' అంటూ అతడికి నల్లరంగులో వున్న ఒక తాయెత్తును చేతికి కట్టాడు కానీ దాని రంగు అలాగే వుండిపోవడంతో, జయద్రధుడు నిరుత్సాహపడిపోయాడు.

సిద్ధయోగి అతడి భుజం తట్టి, ''ఈ భూమ్మీద ప్రతి చెడుకూ ఒక విరుగుడుంటుంది. నీవీ తాయెత్తును ధరించి మహేంద్రగిరి అంతా తిరుగుతూండు. ఏ యువకుడి

దుస్తుల్లో దాచుకున్న నిగనిగలాడే చురకత్తిని తీసి చూపించాడు.

తాయెత్తు కట్టుకోగానే సత్యవంతుడిలో కాస్తధైర్యం మెదిలింది. అతడు, జయద్రధుడి వెంట సారంగం దగ్గరకు వెళ్ళి, అందులో ప్రవేశించాడు. విషసర్పాలతణ్ణి ఏమీ చెయ్యలేదు. అగ్నిగుండం అతడికి చల్లగా తగిలింది. కొండచిలువను చూస్తే శిలావిగ్రహంలా అనిపించి, దాని నోట్లోకి దూరి లోపలకు వెళ్ళి కడుపులో వున్న ఉంగరాన్ని చేజిక్కించుకున్నాడు. ఆ తర్వాత ఏమయిందోమరి - అతడక్కడ మాయమై సారంగం బయట జయద్రధుడి పక్కన ప్రత్యక్షమయ్యాడు.



జయద్రధుడు ఉంగరాన్ని చూసి పరమానందం చెంది, సత్యవంతుడితో ఇక రాక్షసుడి దగ్గరకు వెళదామన్నాడు. సత్యవంతుడు వణుకుతూ, ''మూడు ప్రమాదాలు తప్పించుకున్నాను. ఇక తాయెత్తు మహిమ అయిపోయింది. నాకు రాక్షసుణ్ణి చూడాలంటేనే భయంగా వుంది,'' అన్నాడు.

జయద్రధుడు చేసేది లేక, రాకుమారి మాధవిని కలుసుకుని ఉంగరాన్ని ఆమెకు అందించి, ''దీన్ని తమరు రాక్షసుడికిస్తే, అతడు శాపవిమోచనం చెంది మనరాజ్యాన్ని విడిచి వెళతాడు,'' అన్నాడు.

మాధవి ఆ ఉంగరాన్ని చూసి ఎంతగానో ఆశ్చర్యపడింది. తర్వాత ఆమె జయద్రధుడితోనూ, తండ్రితోనూ కలిసి రాక్షసుడి దగ్గరకు వెళ్ళింది. రాక్షసుడామె ఇచ్చిన ఉంగరాన్ని ధరించి దివ్యపురుషుడుగా రూపుచెంది, మాధవితో, ''ఇప్పుడు నీ పెళ్ళివిషయం ప్రధానం గదా! నిన్ను భార్యగా పొందేవాడు, మరొక్క సాహసకార్యం చేయాలి. అది ఇక్కడికి క్రోసుదూరంలో వున్న దిగుడుబావిలో జరగాల్సి వుంది. ఆ బావి లోపల రత్నకంకణ మొకటున్నది. అది నీకు తెచ్చి యిచ్చినవాడే నీ భర్త! అయితే ఒక్క విషయం. ఆ దిగుడు బావి లోపల మూడు భయంకర భూతాలున్నవి. వాటినెదిరించే శక్తి, ఈ భూమ్మీద ఎవరికీ లేదని నా నమ్మకం. వాటినెదిరించకుండా రత్నకంకణాన్ని చేజిక్కించుకోవడం అసాధ్యం,'' అని మాయమయ్యాడు.

మాధవి, దివ్యపురుషుడి మాటలకు ఆశ్చర్యపడుతూ, ''జయద్రధా! నీవు ఇప్పటికే నరులకు సాధ్యంకానిది సాధించుకు వచ్చావు. రత్నకంకణాన్ని కూడా సాధించి తెచ్చావంటే, నేను వరమాలతో సిద్ధంగా వుంటాను,'' అన్నది.

దీనితో జయద్రధుడకి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. అతడేమీ అనకుండా



దిగాడు. అతడికక్కడ ఏ భూతాలూ ఎదురవ లేదు. నూతి అడుగున ధగధగ మెరుస్తూ రత్నకంకణం కనిపించింది. సత్యవంతుడు దాన్ని తీసుకుని బయటకు వచ్చాడు.

రత్నకంకణాన్ని చూసి జయద్రధుడు పట్టరాని ఆనందంతో, ''ఆహా, సత్యవంతా! నేను చెప్పినది సుగ్రీవాజ్ఞగా తలదాల్చి, ఎన్ని అసాధ్యకార్యాలు సాధించావు! నువ్వు శిథిల విష్ణాలయంలోని గుహనుంచి ప్రాణాలతో బయటకు రాలేవనుకున్నాను. అలాగే, ఈ దిగుడుబావిలో వున్న భూతాలు నిన్ను మింగ గలవనుకున్నాను. కానీ నువ్వు అన్ని ప్రమాదా లనూ అధిగమించి గొప్ప ధైర్యవంతుడవని పించుకున్నావు!'' అన్నాడు.

జయద్రధుడు మాట ముగించే లోపల అక్కడికి రాకుమారి మాధవితోపాటు, రాజు మధుసూదనుడూ,కొందరు భటులూవచ్చారు.

రాకుమారి కోపంగా జయద్రధుడికేసి చూస్తూ, ''జయద్రధా! దివ్యపురుషుడు మరొక సాహసకార్యం చేయాలని నిన్ను ఆదేశించగానే, నీవు మోసగాడివేమో అన్న అనుమానం నాకు కలిగింది! దరిదాపుల వినేవారెవరూ లేరను కుని, ఇప్పుడు నీవన్న మాటల ద్వారా, నా అనుమానం నిజమయింది!'' అన్నది.

రాకుమారి మాధవి ఇలా అనగానే, జయ ద్రధుడు బెంబేలు పడిపోతూ, ''రాకుమారీ! నేనే లేకుంటే, ఈ సత్యవంతుడి వల్ల, ఏ సాహసమూ జరిగేది కాదు. రాజ్యానికి మేలు చేసిన నాకే తమరిని పెళ్ళాడే అర్హత వున్నది,'' అన్నాడు.

మాధవి, జయద్రధుణ్ణి ఈసడిస్తూ, ''నేను ధైర్యవంతుడూ, సాహసీ అయినవాణ్ణి

మాధవి దగ్గర సెలవు తీసుకుని, తిరిగి సత్య వంతుణ్ణికలుసుకుని, రత్నకంకణాన్ని గురించి చెప్పి, తనకు మళ్ళీ సాయపడవలసిందిగా కోరాడు. సత్యవంతుడు గజగజ వణుకుతూ, ''ఆ దిగుడుబావిలో నువ్వనే రత్నకంకణంతో పాటు మరేముంటుందో తెలుసుకున్నావా?'' అని ప్రశ్నించాడు.

''అక్కడ ఒక్క రత్నకంకణం మాత్రమే ఉంటుందట!'' అన్నాడు జయద్రధుడు.

''నేను నమ్మను. ఉత్త రత్నకంకణమే వుంటే నువ్వే వెళ్ళి తెచ్చుకోవచ్చుగదా!'' అన్నాడు సత్యవంతుడు. అతణ్ణి నమ్మించడం కోసం, ''రాక్షసుడికి ఉంగరం తెచ్చినవారికి మాత్రమే, ఈ రత్నకంకణం దొరుకుతుందట. అందుకే నేను నీ దగ్గరకు వచ్చాను,'' అన్నాడు జయ ద్రధుడు.

ఈ కారణాలవల్ల అతడు, జయద్రధు డితోపాటు దిగుడిబావి వద్దకు వెళ్ళి అందులో

పెళ్ళాడతానన్నాను కానీ, రాజ్యానికి మేలు చేసినవాణ్ణి కాదు! ఈ సత్యవంతుడు నిజమైన ధైర్యవంతుడు,'' అన్నది.

ఆ మాట వింటూనే సత్యవంతుడు,''నన్ను మన్నించండి, రాకుమారీ! నేను మీరనుకుంటూన్నంత ధైర్యవంతుణ్ణి కాదు,'' అన్నాడు వినయంగా.

మాధవి నవ్వుతూ, ''నీవు ధైర్యవంతుడివి కాకేం! నువ్వే నన్ను పెళ్ళాడడానికి అర్హుడివి,'' అన్నది.

బేతాళుడు ఈ కథచెప్పి, ''రాజా, జయద్రధుడు తను అనుకున్నది సాధించడం కోసం, సిద్ధయోగిని ఆశ్రయించి, తాయెత్తును పొంది, దానిద్వారా పిరికివాడైన సత్యవంతుడిద్వారా అపూర్వవస్తువులను సాధించి, మహేంద్రగిరికి రాక్షసుడి బాధ తప్పించాడు. రాకుమారి అటువంటి కార్యశూరుణ్ణి నిరాకరించడం ఆడిన మాట తప్పడం కాదా? పైగా సత్యవంతుడు ధైర్యంలేని పిరికివాడని అతని మాటలద్వారానే తెలుస్తున్నది కదా? వాడేదైనా సాధించి వుంటే దానికి కారణం జయద్రధుడు. అలాంటి పిరికివాణ్ణి పెళ్ళాడడం రాకుమారి లక్ష్యానికి విరుద్ధం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''నిజాన్ని నిర్భయంగా ఒప్పుకోవడానికి మించిన ధైర్యం ఈ ప్రపంచంలో మరొకటి లేదు. అసలు జరిగిన విషయాన్ని దాచి, తాను చేయని దానికి ఫలితం పొందాలని అసత్యమాడిన జయద్రధుడే నిజమైన పిరికివాడు. ఇక సత్యవంతుడిలో కొంత ఆత్మవిశ్వాస లోపం వుందిగాని, స్వభావరీత్యా పిరికివాడు కాడు. నమ్మకంతో ధైర్యవాక్యాలు చెబితే ఎంతటి సాహసానికైనా పూనుకోగలడు. అతడు చేసిన సాహసకృత్యాలే ఈ నిజాన్ని నిరూపిస్తున్నాయి. ఇద్దరిమధ్యా ఉన్న ఈ తేడాను గుర్తించి, సత్యాన్ని గ్రహించడం వల్లే, రాకుమారి కపటియైన జయద్రధుణ్ణి నిరాకరించి, సత్యవంతుణ్ణి వివాహమాడాలని నిర్ణయించింది. ఇందులో మాటతప్పడంగాని,లక్ష్య విరుద్ధం అంటూగానీ ఏవీ లేవు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: 'వసుంధర' రచన]








## 'దేవభాష' మాట్లాడుతూన్న గ్రామం!

పదేళ్ళవరకు మనదేశంలోని ఇతర గ్రామాల్లాగే ఉండేది రాజస్థాన్ బాన్స్‌వాడా జిల్లాలోని గనోడా అనే గ్రామం కూడా. ఈ పదేళ్ళలోనే వచ్చింది ఈ విచిత్రమైన మార్పు. ఈ గ్రామంలోని చాలామంది ప్రజలు సంస్కృతాన్ని ద్వితీయభాషగా భావించి నేర్చుకుంటున్నారు. వాగ్డీ వారి మాతృభాష. ప్రాథమిక పాఠశాల, ఉన్నత పాఠశాల, ప్రభుత్వ సంస్కృత కళాశాల ఈ మూడు విద్యాసంస్థలలో సంస్కృతం బోధిస్తున్నారు. ఉపాధ్యాయులూ, వెయ్యిమందికి పైగా విద్యార్థులూ సంస్కృతభాషా ప్రాచుర్యం పెంచడానికి బద్ధకంకణులయ్యారు. కలిసికట్టుగా కృషిచేస్తున్నారు. ఇంటా, బయటా ప్రజలు సంస్కృతమే మాట్లాడతారు; ఇళ్ళ గోడలపై సంస్కృత నినాదాలు ఉన్నాయి. సంస్కృతపదాలను, భాషను నేర్చుకోవడాన్ని ప్రోత్సహించేలా కొన్ని ఇళ్ళకు సంస్కృతపదాలు, శుభాకాంక్షలు, సుభాషితాలుగల వాల్ పోస్టర్లు అతికించారు. ఇన్ని చేసే ప్రజలు తరచూ సంస్కృత శ్లోకాలు వల్లెవేస్తారని వేరుగా చెప్పనవసరం లేదుకదా!

## మన్మథదేవుడి పూజలు



కేరళరాష్ట్రం ఉత్తర మలబార్‌లో ఆడపిల్లలు మార్చ్- ఏప్రిల్ నెలలమధ్య కామదేవుడు మన్మథుడి విగ్రహాలు చేసి పూజలు చేస్తారు. జగన్మాత భగవతి ఆలయాలలో 'నవరాత్రి' ఉత్సవాలు జరిగేప్పుడు ఈ పూజలు చేస్తారు. మన పురాణాల ప్రకారం తనకు తపోభంగం కలిగించాడని, పరమశివుడు ఆగ్రహంతో మూడవ నేత్రం తెరిచి మన్మథుణ్ణి భస్మం చేసేశాడు. మన్మథుడి భార్య రతీదేవి తన భర్తను బతికించమని శివుణ్ణి వేడుకున్నది. పూలతో మన్మథుడి విగ్రహాన్ని చేసి పూజించమని రతీదేవిని శివుడు ఆదేశించాడు. అలా రతీదేవి భర్త విగ్రహాన్ని పూజించిన దానికి గుర్తుగానే 'పూరం' అనే ఈ పండుగ ఏర్పడిందని చెబుతారు.

మనపూర్వగాథలు: 17

# సన్యాసి - పండు

పురాతనమైన పవిత్ర వారణాసీనగర సమీపంలోని సారనాథ్ పరిసరాలలో పచ్చటి తోటల నడుమ కొత్తగా సన్యాసుల మఠం వెలసింది. ఆ ఆశ్రమాన్ని కపిలవస్తు రాజకుమారుడు గౌతముడు స్థాపించాడని తెలిసి, ఆ చుట్టుపక్కల గ్రామప్రజలు ఆశ్చర్యపోయారు. గౌతముణ్ణి ఇప్పుడు ఆయన శిష్యులు భక్తితో, గౌతమ బుద్ధుడు అని పిలుస్తున్నారు.

బుద్ధుడూ, ఆయన శిష్యులూ కఠినమైన సన్యాసజీవితాన్ని గడిపేవారు. ప్రాతఃకాల ధ్యానం పూర్తికాగానే కొందరు శిష్యులు చుట్టుపక్కల గ్రామాలకేసి బయలుదేరేవారు. వాళ్ళు తమను భిక్షువులుగా చెప్పుకునేవారు. ఒక్కొక్క ఇంటిముందు, ఆ ఇంటి గృహస్థు చూపులు తమ మీద పడేంతవరకు నిలబడేవారు. భిక్షువు చేతిలోని భిక్షాపాత్ర ఆయన భిక్షకు వచ్చాడన్న విషయం సూచించేది. గృహస్థులు సాధారణంగా తమకున్న దానిని భిక్షాపాత్రలో వేసేవారు. కొందరు గృహస్థులు లేదని చేయి ఊపితే భిక్షువు మౌనంగా అక్కడి నుంచి పక్కింటి ముందుకు వెళ్ళే వాడు.

కాశీనగరవాసులూ, పరిసర గ్రామప్రజలూ అప్పుడప్పుడూ ఉత్సాహం కొద్దీ ఆశ్రమానికి వచ్చేవారు. ఆశ్రమంలో గురువుగా వున్న గౌతమబుద్ధుణ్ణి చూసి సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యేవారు. ఆయన తన శిష్యులకు క్లిష్టమైన తాత్విక విషయాలను విశదంగా విపులీకరించేవాడు. శిష్యులు అడిగే ప్రశ్నలకు సూటిగా





సమాధానాలు చెప్పేవాడు. శిష్యుల మీద అపరిమితమైన ప్రేమతో, ప్రశాంతవదనంతో ఆయన పలికే వినిర్మలమైన ప్రతి పలుకూ వినేవారికి వింత అనుభూతిని కలిగించేది. ప్రజలు ఆ అద్భుత దృశ్యాన్ని చూస్తూ గంటల కొద్దీ అలాగే నిలబడిపోయేవారు.

సారనాథ్ సమీపంలోనే ధనికుడైన ఒక వర్తీవ్యాపారి ఉండేవాడు. అతడు ఎప్పుడు గాని బుద్ధవిహారానికి వెళ్ళలేదు. అయితే, బుద్ధుడిపట్ల ఒకవిధమైన విరక్తినీ, పగనూ పెంచుకున్నాడు. బుద్ధుడి బోధలను ప్రజలందరూ విని, అంగీకరించి, ఆచరణలో పెట్టారంటే, లౌకిక కార్యకలాపాలపట్ల వారికి ఆసక్తి సన్నగిల్లుతుంది. ధనసంపాదన గురించి పట్టించుకోరు. ధనమే అనవసరమైపోయినప్పుడు, తన వ్యాపారం గతి ఏమవుతుంది? ఇలా ఆలోచించే కొద్దీ బుద్ధుడి పట్ల అతడి ఆగ్రహం పెరిగిపోయేది.

ఒకనాడు ఉదయం వ్యాపారి స్నానానికి నదికి బయలుదేరుతూ, తమ ఇంటి ముందు ఒకయువభిక్షువు నిలబడి ఉండడం చూశాడు. ఆ క్షణమే అతనికి పట్టరాని కోపం వచ్చింది. భిక్షం వేయడం ఇష్టం లేదంటే, లేదని చేయి ఊపి తన మానాన తను వెళ్ళి వుండవచ్చు. అయితే, అతడు అలా చేయలేదు. భిక్షువుకు సరైన గుణపాఠం చెప్పాలని నిర్ణయించుకున్నాడు.

''ఒకపక్క తెల్లవారకముందే బయలుదేరావా? నువ్వు ఎప్పుడు వస్తావా అని చూస్తున్నాను. ఇలా చూడు, నువ్వొక దేశదిమ్మరివి. దమ్మిడీకికొరగాని నీచుడివి, అప్రయోజకుడివి!'' అని అరిచాడు వ్యాపారి.

అయితే భిక్షువు నోరుతెరవలేదు. అది వ్యాపారికి మరింత ఆగ్రహం తెప్పించింది. మరొక అడుగు ముందుకువేసి, బిగించిన పిడికిలిని పైకెత్తి, ''నిన్ను గురించే కాదు. నీ గురువు గౌతముణ్ణి గురించి కూడా నాకు బాగా తెలుసు. వాడొక మూర్ఖుడు, వట్టి సోమరిపోతు. ఇక వాడి శిష్యులైన మిమ్మల్ని గురించి చెప్పాలా? పరమనీచులు,'' అన్నాడు.

అప్పటికీ సన్యాసి ఒక్కమాట మాట్లాడ లేదు. దాంతో ఇంకా రెచ్చిపోయిన వ్యాపారి, ఉత్సాహంతో తిట్టిన తిట్టు తిట్టకుండా తనకు తెలిసిన తిట్లన్నిటినీ తిట్టిపోశాడు. ఆ సమయంలో అటుగా వెళుతున్న కొందరు, వ్యాపారి ఆగ్రహానికి కారణం తెలియక విస్తుపోయి చూడసాగారు. అది వ్యాపారికి మరింత ఉత్సాహంకలిగించింది. అతడు మరింత గొంతెత్తి మరిన్ని తిట్లు తిడుతూ ఆవేశంతో ఊగిపోసాగాడు. ఇలా తిట్టి తిట్టి కొంతసేపటికి బాగా అలిసిపోయాడు.

మెల్లగా సన్యాసికి మరింత దగ్గరికి వచ్చాడు. సన్యాసి ప్రశాంతవదనంలోని తేజస్సును చూసి ఒక్క క్షణం చలించిపోయాడు. ఇంతసేపూ తాను నానా దుర్భాషలాడినప్పటికీ, ఆ సన్యాసి ఒక్కమాట కూడా మాట్లాడలేదన్న సంగతీ, తను చూపిన అకారణ ఆగ్రహానికి లవలేశం కూడా ఆయన మోములో చలనం కనిపించలేదన్న విషయమూ వ్యాపారికి తెలియవచ్చింది.

అప్పటికీ కోపం తగ్గని వ్యాపారి, ''ఎందుకలా మౌనంగా ఉన్నావు? మూగవాడివి కావు కదా! సమాధానం చెప్పు,'' అని గద్దించాడు.

సన్యాసి మందహాసం చేస్తూ, తన జోలె నుంచి ఒక పండును తీసి వ్యాపారికి చూపిస్తూ, ''మిత్రమా! ఇప్పుడు ఈ పండును నేను నీకు ఇస్తాననుకో.నువ్వు తీసుకోవడానికి నిరాకరించినట్టయితే, అది ఎక్కడికిపోతుంది?''అని అడిగాడు.

''ఎక్కడికి పోతుందా? ఏమిటాప్రశ్న? నీ దగ్గరే వుంటుంది. అది కూడా తెలియదా?'' అన్నాడు వ్యాపారి.

''సరే మిత్రమా, మంచిది. అలాగే నువ్వు ఇంతవరకు మాట్లాడిన విషయాలను నేను తీసుకోలేదు. కాబట్టి ఇప్పుడు అవి ఎక్కడున్నాయో నీకు తెలుసు కదా?'' అని అడిగాడు సన్యాసి.

ఆ మాటతో వ్యాపారి దిగ్భ్రాంతి చెందాడు. తాను మాట్లాడిన దుర్భాషలన్నీ తనవద్దే ఉన్నట్టు గ్రహించాడు.చెడుమాటలు ఆగంతకుని స్పృశించలేదు. ఎందుకంటే, ఆ సన్యాసి మోములో ఏమాత్రం బాధ, విచారమూ ఛాయామాత్రంగానైనా స్ఫురించలేదు.

ఆలోగా అక్కడ చేరిన ప్రజలు ప్రసన్న వదనంతోవున్న ఆ సన్యాసి మరెవరో కాదనీ, సాక్షాత్తు గౌతమబుద్ధుడే అనీ గ్రహించారు. అందరూ ఆయనకు తలలు వంచి నమస్కరించారు. ఆఖరికి వ్యాపారి కూడా అపరిమితమైన భక్తిశ్రద్ధలతో శరీరం వణుకుతూండగా బుద్ధుడికి పాదాభివందనం చేశాడు! –బిందుసార్





# వ్యర్థమైన వరాలు

హేలాపురిలో సీతయ్య అనే పేద కుటుంబీకుడు ఉండేవాడు. అడవిలో కట్టెలు కొట్టి, వాటిని ఊళ్ళో అమ్మి, ఇంట్లోకి కావలసిన పచారీ సామానులు తెస్తూండేవాడు. గంపెడు సంతానంగల సీతయ్యకు, తన జీవితంపట్ల అప్పుడప్పుడూ తీవ్రమైన విరక్తి కలుగుతూండేది. ఏ దేవత అయినా కరుణించి తనను ఈ కష్టాల నుంచి గట్టెక్కించ లేదా అని ఆలోచిస్తూండేవాడు.

ఒకనాటి ఉదయం వేళ రోజూలాగే కట్టెలు కొట్టితెచ్చేందుకు అడవికి వెళ్ళాడు, సీతయ్య. అక్కడ ఒక పెద్ద వృక్షాన్ని ఎంచుకుని దాన్ని నరికేందుకు గొడ్డలి పైకెత్తాడు. ఐతే, ఎత్తిన గొడ్డలి ఎత్తినట్లే వుండడంతో, అతడు తలఎత్తి చూశాడు. తన గొడ్డలిని పట్టుకుని ఆపినది వృక్షదేవత అని తెలియగానే, సీతయ్యకు చాలా ఆశ్చర్యం కలిగింది.

''సీతయ్యా, నేనీ వృక్షదేవతను. దీన్ని నరికే ప్రయత్నం చేయకు. ఎన్నో ఏళ్ళుగా ఇక్కడ నేను నివాసం వుంటున్నాను. నీ పేదరికం నేనెరుగుదును. నీకు మూడు వరాలు ఇస్తాను. రోజుకొక వరం చొప్పున మూడు రోజులపాటు నీకు నచ్చిన మూడు వరాలు కోరుకో. అంతటితో నీ దారిద్ర్యం తీరిపోతుంది,'' అన్నది వృక్షదేవత.

''అలాగే, తల్లీ! నువ్వు నివాసం వున్న చెట్టును కొట్టను. నువ్వు అనుగ్రహించిన ప్రకారం, రోజుకొకవరం కోరుకుంటాను. తప్పక తీరుస్తావు గదా?'' అని అడిగాడు సీతయ్య అనుమానంగా.

''తప్పకుండా తీరుస్తాను!'' అని వృక్షదేవత మాయమైంది.

సీతయ్య మరొక చెట్టును కొట్టే ఆలోచన చేయకుండా ఆనందంగా ఇంటికి వెళ్ళిపోయాడు. తర్వాత మధ్యాహ్న భోజనం వేళ కాగానే, ''మా ఇంటిల్లిపాదీ తినడానికి చక్కని పిండివంటలతో భోజనం కావాలి!'' అని కోరుకుని కళ్ళు మూసుకున్నాడు.

కోనే నాగవెంకట ఆంజనేయులు

తను తిరిగి కళ్ళు తెరిచేసరికి, తనుకోరిన విందుభోజనం సిద్ధంగా వుంటుందనుకుని, సీతయ్య కొద్దిసేపు తర్వాత కళ్ళు తెరిచాడు. కానీ, తను కోరిన భోజనపదార్థాలు కనబడక పోవడంతో, తన వరం నిజం కావడానికి మరి కొంతసేపు వేచివుండవలసి వస్తుందని మనసును సరిపెట్టుకున్నాడు.

ఇంతలో తలుపు తట్టిన చప్పుడవడంతో సీతయ్య వెళ్ళి ఆతృతతో తలుపు తెరిచాడు. ఎదురుగా పక్క వీధిలో వుండే సోమయ్య, తలమీద పెద్ద తట్టతో కనిపించాడు. అందులో వున్న రకరకాల పిండివంటలు సువాసనలు వెదజల్లుతున్నాయి.

"ఈ రోజు మా ఇంట్లో వ్రతం చేసుకున్నాం, సీతయ్యా! మా ఆవిడ ఇవన్నీ మీకు ఇచ్చి రమ్మన్నది," అంటూ తట్ట దించబోయాడు, సోమయ్య.

ఐతే, సీతయ్య అతణ్ణి వారిస్తూ, "కొద్దిసేపట్లో మా ఇంటికి రకరకాల ఆహారపదార్థాలు రాబోతున్నవి. అందువల్ల నువ్వు తెచ్చినవి వృథాకావచ్చు!" అంటూ సోమయ్య మరొకమాట మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా తలుపు మూసేశాడు.

ఆ తర్వాత సాయంకాలం గడిచిపోయినా, సీతయ్యకు ఎలాంటి ఆహారం అందలేదు. చూసి చూసి విసిగిపోయిన అతడు భార్యతో చెప్పి, ఇన్ని నూకలు గంజి కాయించి, అందరూ ఆ పూటకు ఆకలి చల్లార్చుకున్నారు.

వృక్షదేవత వరం ఫలించకపోవడం సీతయ్యకు ఆశ్చర్యం కలిగించింది. అతడు మర్నాటి ఉదయం బాగా ఆలోచించి, నౌకర్లూ, దాసీజనంతో అందంగా వుండే పెద్దభవనం



కావాలని రెండవ వరం కోరుకుని, కళ్ళు మూసుకున్నాడు. ఒక అరగంట కాలం గడిచాక అతడు కళ్ళు తెరిచేసరికి, తను ఎంతో కాలంగా వుంటున్న పూరిల్లు అలాగే వున్నది. ఈసారి సీతయ్యకు ఆశ్చర్యంతో పాటు ఎక్కడ లేని నిరాశ కలిగింది.

ఇంతలో ఎవరో తలుపు తట్టారు. సీతయ్య తలుపు తెరిచేసరికి, ఎదురుగా ఒక అపరిచిత వ్యక్తి కనిపించి, "అయ్యా, నేను సుగంధపురి నుంచి వస్తున్నాను. మీ పెదనాయనగారు చావుబతుకుల్లో వున్నారు. మిమ్మల్ని వెంటనే తీసుకురమ్మన్నారు," అన్నాడు.

సీతయ్య, వృక్షదేవత ఇచ్చిన వరం ఫలించే వరకూ ఇంటినుంచి కదలకూడదనుకున్నాడు. అందువల్ల అతడు, ఆ వచ్చినవాడితో, "మరేం అనుకోవద్దు. నేను ఇప్పుడు చాలా అత్యవసరమైనపనిలో వున్నాను. ఈ కారణంగా, నేను



రాలేనని, మా పెదనాయనగారికి చెప్పండి,'' అన్నాడు.

ఆనాటి రాత్రి గడిచినా సీతయ్య పూరిల్లు భవనంగా మారలేదు. ఆ విధంగా వృక్షదేవత రెండోవరం కూడా ఫలించకపోవడంతో, అతడు విచారంతో కృంగిపోయాడు. మర్నాడు పరిపరి విధాలుగా ఆలోచించి, మూడోవరంగా లక్ష బంగారు వరహాలు కావాలని కోరుకున్నాడు, సీతయ్య.

అతడికి లక్షవరహాల మూట ప్రత్యక్షం కాలేదుగానీ, మధ్యాహ్నం వేళకు లాఠీకర్రలు చేతబట్టిన ఇద్దరు దృఢకాయులు, అతడి ఇంటికి వచ్చి, సీతయ్యతో, "మేము జమీం దారు వీరభూపతిగారు పంపగా వచ్చాము. మిమ్మల్ని ఉన్నఫళంగా తీసుకురమ్మన్నది వారి ఆజ్ఞ!'' అన్నారు.

ఇది విన్న సీతయ్యకు ముచ్చెమటలు పోశాయి. గతంలో ఒకసారి సీతయ్య, జమీం దారుగారి జమీలో ఒక చెట్టు నరుకుతూ ఆయన కళ్ళబడ్డాడు. జమీందారు ఆజ్ఞాపించ గానే నౌకర్లు పట్టుకోవాలని చూస్తే, వాళ్ళకు దొరక్కుండా పారిపోయాడు. ఇప్పుడు జమీం దారు తనను శిక్షించేందుకు భటులను పంపా రనుకున్నాడతను.

సీతయ్య తడబడుతున్న స్వరంతో, "అయ్యా, సుగంధపురిలో, మా పెదనాయన ఆరోగ్యం ఏం బాగాలేదు. ఇప్పుడేకబురొచ్చింది. నే వెంటనే వెళ్ళాలి. జమీందారుగారి దర్శనం సుగంధపురి నుంచి వచ్చాక చేసుకుంటాను,'' అని చెప్పాడు.

ఆ రాత్రి గడిచింది. సీతయ్య కోరిన లక్ష బంగారు వరహాలు లభించలేదు.ఈ విధంగా వృక్షదేవత మూడువరాలూ ఫలించకపోవ డంతో, సీతయ్య ఎక్కడలేని కోపంతో గొడ్డలి భుజాన పెట్టుకుని అడవిలోని వృక్షదేవత చెట్టువద్దకు వెళ్ళాడు.

వృక్షదేవత, అతడికి ప్రత్యక్షమై, "ఏం, సీతయ్యా, ఈ గొడ్డలేమిటి? మూడు వరాలి చ్చానుగదా?'' అని ప్రశ్నించింది.

"ఆ వరాల్లో ఒక్కటి కూడా ఫలించలేదు!'' అంటూ సీతయ్య, వృక్షదేవతకు జరిగిందంతా వివరంగా చెప్పాడు.

"అదేమిటి! ఎందుకు ఫలించలేదు? సోమ య్యతో పంచభక్ష్యపరమాన్నాలు పంపాను గదా? సుగంధపురిలో నీ పెదనాన్న, తను మరణించే ముందు, తనకు పిల్లలంటూ లేని కారణంగా, రాజమహలులాంటి తన భవ నాన్ని నీకివ్వాలనుకున్నాడు. ఆయన కబురు

చేసినా నువ్వు వెళ్ళలేదు, అవునా?'' అని అడిగింది వృక్షదేవత.

సీతయ్యకు నోటమాట పెగల లేదు. తనకు తానై, వృక్షదేవత ఇచ్చిన రెండు వరాలూ ఫలించకుండా చేసుకున్నాడన్న మాట! అతడు కొద్దిక్షణాలు తన దురదృష్టానికి బాధపడి, వృక్షదేవతతో, ''తల్లీ! ఆ మూడో వరంగా లక్ష బంగారు వరహాలు కావాలని కోరుకున్నానే, అదైనా ఎందుకు ఫలించలేదు?'' అన్నాడు.

వృక్షదేవత చిరునవ్వు నవ్వి, ''ఆ మూడు వరాలూ ఫలించకపోవడం, నీ దురదృష్టం. దానికి కారణం, నీ మితిమీరిన స్వార్థం, పేరాశ. నీకు బంగారు వరహాలిచ్చేందుకే జమీందారు, నిన్ను రమ్మని భటులచేత కబురు పంపాడు. గతంలో, ఆయన జమీలో నువ్వు నరికిన చెట్టు పాదంలో, ఆయనకు తన పూర్వీకులెవరో రాగి బిందెల్లో దాచిపెట్టిన పదిలక్షల బంగారు వరహాలు లభించాయి. ఆ బిందెలు బయట పడడానికి కారణం నువ్వుగనక, నీకు లక్ష వరహాలిచ్చి సన్మానించదలిచాడు. కాని, నువ్వు ఆయన దర్శనానికి వెళ్ళలేదు. అందువల్ల, ఆయన నిన్నొక పొగరుబోతుగా భావించి, ఆ లక్ష వరహాలనూ జమీలో వున్న పేదసాదలకు దానం చేశాడు,'' అని చెప్పింది.

వృక్షదేవత మాటలు విని కొంతసేపు నోట మాట రాక అలాగే కొయ్యబారిపోయాడు, సీతయ్య. తర్వాత తేరుకుని, ''చెట్టుతల్లీ! మరొక మూడువరాలు ప్రసాదించు,'' అంటూ చేతులు జోడించాడు.

దానికి వృక్షదేవత కాదన్నట్టు తలవూపి, ''ఒక్కసారికి మించి వరాలు ప్రసాదించే శక్తి, నాకు లేదు. అవివేకం, దురాశకొద్దీ నేనిచ్చిన వరాలు వ్యర్థం చేసుకున్నావు. అదృష్టం మనిషిని ఒకసారి మాత్రమే తలుపు తడు తుంది; కానీ నీ విషయంలో మూడుసార్లు తలుపు తట్టింది! ఇకపై నువ్వు చేయవల సింది, నీ స్వశక్తిని నమ్ముకోవడమే. ముందు ముందు నువ్వు జీవనోపాధికి అడవిలో ఎండి పోయిన కట్టెలను మాత్రమే కొట్టుకుంటూ, చెట్టుచేమలకు ఎలాంటి హానీ చేయకుండా, వాటిని రక్షించుకుంటూ వచ్చినంతకాలం నా అనుగ్రహం వలన – నీకూ, నీ కుటుంబానికీ ఏ రోజూ తిండిలేక ఇబ్బందిపడే పరిస్థితి రాదు,'' అని అదృశ్యురాలయింది.



# సిక్కిం జానపద కథ!

మనదేశంలో ఈశాన్య దిశగా కొండల మధ్య ఉన్న పర్వతరాష్ట్రం సిక్కిం. హిమాలయ పర్వతాల పాదతలంలో వున్న ఈ రాష్ట్రానికి ఎగువ, ప్రపంచంలో మూడవ ఎత్తయిన పర్వత శిఖరమైన కాంచనజంగ (8,598 మీ.) వున్నది.

ఈ రాష్ట్రం సముద్రమట్టానికి 300 మీ. నుంచి 8,585 మీ. ఎత్తు వరకు ఉన్నది. రాష్ట్రంలో కొంత శాతం మాత్రమే నివాసయోగ్యమైన ప్రాంతం.

7,096 చ.కి.మీ. విస్తరించిన ఈ రాష్ట్ర జనాభా 5,40,493. ఉత్తర దిశలో టిబెట్, తూర్పున భూటాన్, పడమర నేపాల్, దక్షిణంగా పశ్చిమబెంగాల్ ఈ రాష్ట్ర సరిహద్దులుగా ఉంటున్నాయి.

కాంచన్‌జంగాను సిక్కింలో కాంగ్ చెంద్‌జోంగా అని పిలుస్తారు. ఈ కొండ శిఖరాన్ని ప్రజలు పూజిస్తారు. తమ భూమిని సంరక్షించే అధిదేవుడిగా ప్రజలు దానిని భావిస్తారు.

టీస్టా ఇక్కడ ప్రవహించే ప్రధానమైన నది. గాంగ్‌టోక్ రాజధానిగా 1975 ఏప్రిల్ 26వ తేదీ సిక్కిం, భారతదేశంలో ఒక రాష్ట్రమయింది. అంతకు పూర్వం ఇక్కడి పాలకుణ్ణి 'చోగ్యాల్' అని పిలిచేవారు. ఇక్కడ ఇంగ్లీషు అధికార భాష. నేపాళీ, హిందీ, సిక్కిం, లెప్చా భాషలు మాట్లాడే ప్రజలు ఇక్కడ నివసిస్తున్నారు.

## మంత్రగత్తె - అందమైన అమ్మాయిలు

మనోహరమైన ఒక కొండ పాదతలంలోని లోయలో అందమైన వనం మధ్య వున్న చిన్న గుడిసెలో ఇద్దరు అందమైన అమ్మాయిలు నివసిస్తూండేవారు. వాళ్ళిద్దరూ అక్కచెల్లెళ్ళు. అక్క పేరు కోంతార్‌హాప్, చెల్లెలి పేరు జార్లర్ హాప్. కోంతార్‌హాప్‌కు అందమైన కంఠస్వరం ఉండేది. ఆమె పాడితే పువ్వులు వికసించేవి. ఆ పాటకు చెల్లెలు నాట్యం చేస్తే - సింహం, ఎలుగుబంటి, చిరుతపులి వంటి వన్యమృగాలు సైతం ఆమెతో కలిసి నాట్యం చేసేవి.

ఆ వనానికి అధిపతి రూమూదేవుడు. చాలా అద్భుతమైన అరుదైన పుష్పాలకు నిలయమైన ఆ వనాన్ని అక్కా చెల్లెళ్ళు జాగ్రత్తగా సంరక్షించుకుంటూ వచ్చారు. ముఖ్యంగా



ఆ పరిసరాలలో నడయాడే లైయాంగ్‌బార్ మంత్రగత్తె టైయాంగాప్ నుంచి దానిని కాపాడుకుంటూ వచ్చారు. మనుషులను స్వయంగా వెళ్ళి పీడించే ముందు, ఆ మంత్ర గత్తె వాళ్ళ కలలో కనిపించి హడలగొట్టేది. కోరిన రూపాన్ని ధరించే శక్తి ఆ మంత్రగత్తెకు ఉండేది. దాని దుష్టశక్తుల ప్రభావాన్ని ఎదుర్కొనే శక్తి ఎవరికీ ఉండేది కాదు.

ఒకరోజు జార్ఖర్‌హాప్‌కు ఒక వింతకల వచ్చింది. తన అక్క బంగారు దిండును టైయాం గాప్ లాక్కున్నట్టు కలగన్నది. భయంతో కీచు మని కేకపెడుతూ ఆమె లేచి కూర్చున్నది. ఆమె ఏడుపు విని కోంతార్‌హాప్ కూడా లేచింది. ఇద్దరూ విచారంతో తలలు పట్టుకున్నారు. టైయాంగాప్ తమ మీదికి దాడిచేసే సమయం సమీపించిందని గ్రహించి అక్కాచెల్లెళ్ళిద్దరూ భయంతో ఆలోచించసాగారు.

మంత్రగత్తె వస్తే ఎలా తప్పించుకోవడమా అని అక్కాచెల్లెళ్ళు తీవ్రంగా ఆలోచిస్తున్న ప్పుడు ఒక అందమైన యువతి వనంలో తిరు గాడుతూండడం వాళ్ళ కంటబడింది.

''అది ఎవరై వుంటారు? మారువేషంలో వస్తున్న మంత్రగత్తె కాదు కదా?'' అన్నది కోంతార్‌హాప్ భయంతో వణుకుతూ.

చెల్లెలు వెంటనే బంగారు దిండును తీసి రొమ్ముకు అదుముకుంటూ, ''సందేహం లేదు. ఇది టైయాంగాప్ మంత్రగత్తే అయి వుంటుంది. చూడు చూడు, అది తిన్నగా మనదగ్గరకే వస్తున్నది,'' అన్నది కన్నీళ్ళు కారుస్తూ.

దర్జాగా నడిచి వచ్చిన ఆ యువతి వాళ్ళ పక్కన కూర్చుంటూ, ''మీలాంటి అందమైన అమ్మాయిలను నేనెక్కడా చూడలేదు. మీ అందచందాలను చూసి లయాంగ్‌బార్ రాజు మిమ్మల్ని ప్రేమించడంలో ఆశ్చర్యం లేదు.



ఆయన మిమ్మల్ని పెళ్ళాడాలనుకుంటున్నాడు. మీ ఇద్దర్నీ అక్కడికి తీసుకువెళ్ళడానికేనేనిప్పుడు వచ్చాను. బయలుదేరండి. త్వరగా బయలు దేరారంటే సాయంకాలానికి అక్కడికి చేరుకో వచ్చు,'' అన్నది నవ్వుతూ.

''మేము ఇక్కడే సంతోషంగా ఉన్నాం. రాణులు కావాలన్న కోరిక మాకు లేదు. పైగా రాణులు అయ్యే అర్హత కూడా మాకు లేదు. దయచేసి మమ్మల్ని మా మానాన వదిలిపెట్టు,'' అన్నది కోంతార్‌హాప్.

ఈ మాటలు టైయాంగాప్‌కు ఆగ్రహం కలిగించాయి. తను వేసిన పథకానికి ఆటంకం కలగడంతో, ''ఇది రాజు ఆజ్ఞ. దానిని మీరు అతిక్రమించలేరు. త్వరగా తెములండి. మర్యా దగా లైయాంగ్‌బార్‌కు నాతో రండి!'' అని హెచ్చరించింది.

అక్కాచెల్లెళ్ళు హడలిపోయారు. ఆ యువతి మంత్రగత్తె అనే వాళ్ళ అనుమానం బలపడ సాగింది. కోంతార్‌హాప్ ఆ యువతిని శాంతింప



జేయడానికి ప్రయత్నిస్తూ, ''కోపగించుకోకు. ఆకలిగా ఉన్నట్టున్నావు. ఏదైనా తిను,'' అంటూ ఆ యువతిముందు ఒకపళ్ళెం నిండా అన్నం, వేయించిన ఒక గొర్రెను ఉంచింది. వెంటనే దానిని తినేసి, ఆ యువతి ఇంకా కావాలన్నది. వంట గదిలో ఉన్నదంతా తెచ్చి ఆ యువతి ముందుంచారు. ఆ యువతి దానిని క్షణాలలో ఖాళీ చేసేసింది. దానిని చూసిన అక్కాచెల్లెళ్ళు ఆ యువతి మంత్రగత్తె టైయాంగాప్ తప్ప మరొక్కరు కాదన్న దృఢనిర్ణయానికి వచ్చారు.

తినడం పూర్తికాగానే, ''ఇంకా ఎందుకు ఆలస్యం? బయలుదేరండి,'' అన్నది టైయాంగాప్.

''మాకు ఇక్కడ చాలా పనులున్నాయి. పొలం దున్నాలి. విత్తనాలు చల్లాలి,'' అన్నది కోంతార్‌హాప్.

''ఆ విచారం నీకొద్దు. ఆ పనులన్నిటినీ నేను చిటికలో పూర్తిచేస్తాను,'' అన్నది ఆ యువతి.

ఆ తరవాత ఆమె ఏదో మంత్రం చెబుతూ, చేయి ఊపింది. అంతే, పొలం దున్నడం, విత్తనాలు చల్లడం క్షణాలలో పూర్తయ్యాయి. ''మీరు చెప్పిన పనులు అయిపోయాయి కదా? బయలుదేరండి,'' అన్నదా యువతి.

''ఇంకానేను వడ్లు దంచాలి. వస్త్రం నేయాలి. అవన్నీ పూర్తిచేశాకే, నీతో రావడం సాధ్యం!'' అన్నది జార్ఖర్‌హాప్.

ఆ పనులను కూడా ఆ యువతి తన మాయాజాలంతో క్షణాలలో పూర్తిచేసింది. ఇక ఏ సాకూ చెప్పడానికి వీలులేక అక్కాచెల్లెళ్ళు ఆ యువతి వెంట బయలుదేరక తప్పలేదు.

కొంతదూరం నడిచి వాళ్ళొక నదీతీరాన్ని చేరుకున్నారు. అక్కడి నుంచి రాజభవనం కనిపిస్తున్నది. దానిని చూడగానే, ''ఆహా, రాజభవనాన్ని సమీపించాము. ఇకపై ఎలాంటి ముప్పూ రాదు. బహుశా ఈ యువతి నిజంగానే రాజు పంపిన మనిషేనేమో!'' అన్నది జార్ఖర్‌హాప్ చెల్లెలితో ఎంతో ఆశగా.

అయితే, ఆ వచ్చిన యువతి నాలుగడుగులు ముందుకు వేసి నిలబడి వెనక్కు తిరిగి చూసింది. తరవాత నదిలోని నీళ్ళ దగ్గరికి వెళ్ళి అక్కా చెల్లెళ్ళతో, ''రండి,రాజును చూసేలోపల స్నానంచేసి, తాజాగా హుషారుగా తయారుకండి,'' అన్నది.

కోంతార్‌హాప్ నీళ్ళలోకి వంగి ముఖం కడుక్కోవడానికి దోసిలితో నీళ్ళు తీసుకోబోయింది. అంతలో టైయాంగాప్ ఆమెను ఒక చేపగా మార్చి, నీళ్ళలోకి విసిరివేసింది.

జార్ఖర్‌హాప్ దీనిని చూసి భయంతో వణికిపోయింది. అక్కడినుంచి పరిగెత్తిపోవడానికి ప్రయత్నించింది కాని, టైయాంగాప్ ఆమెను పట్టుకొని, ''భయపడకు – నువ్వు నా మాట విన్నంతవరకు నీకు ఏ హానీ చేయను,'' అన్నది.

ఆ తరవాత మంత్రకత్తె, తన రూపాన్ని కోంతార్ హాప్‌లా మార్చుకుని, "నేను నీ అక్కలాగా కనిపిస్తున్నాను కదూ!'' అన్నది.

జార్ఘర్‌హాప్ ఆశ్చర్యంతో దిమ్మెరపోయింది. ఆమె నోట మాట రాలేదు. మంత్రగత్తె టైయాం గాప్ అచ్చంగా తన అక్కలాగే ఉంది!

ఇద్దరూ రాజభవనం చేరుకున్నారు. మంత్ర గత్తె తనను కోంతార్‌హాప్‌గానూ, జార్ఘర్ హాప్‌ను తన పరిచారికగానూ రాజుకు పరిచయం చేసుకున్నది. ఆమె అందానికి ముగ్ధుడైన రాజు ఆమెను వెంటనే పెళ్ళి చేసేసుకున్నాడు. వాళ్ళు రాజభవనంలో రాచభోగాలు అనుభవించ సాగారు. జార్ఘర్‌హాప్ మాత్రం పొద్దస్తమానం ఇంటిచాకిరీ చేసేది.

మధ్యాహ్న సమయంలో జార్ఘర్‌హాప్ రాజుగారి గొర్రెలను మైదానాలకు తోలుకు పోయి మేపుకుని వచ్చేది. ప్రతి సాయంకాలం, టైయాంగాప్, గొర్రెలను లెక్కపెట్టే నెపంతో అక్కడికి వచ్చి, తన భయంకరమైన ఆకలిని తీర్చుకోవడానికి రెండు మూడు గొర్రెలను తినేసేది.

ఒకరోజు జార్ఘర్‌హాప్ నదీతీరంలో గొర్రెలను మేపుతూ తన అక్కను తలుచుకున్నది. రాజ భవనంలో తాను చేస్తున్న చాకిరీ, పడుతూన్న బాధలూ ఏకరువుపెడుతూ, తన అక్కను తలు చుకుని భోరున విలపించసాగింది.

హఠాత్తుగా ఆమెకు నదిలో నుంచి ఎవరో మాట్లాడుతున్నట్టనిపించింది. ఆమె పరికించి చూసింది. ఆ మాట్లాడుతున్నది చేప. అది తన అక్కేనని జార్ఘర్‌హాప్ ఆ క్షణమే గ్రహించింది. ఎదురుచూడని విధంగా ఆమె అక్క అసలు రూపంతో లేచి వచ్చింది. గట్టుపై కూర్చుని అక్కాచెల్లెళ్ళు మాట్లాడుకున్నారు. కొంతార్ హాప్ మంత్రగత్తె ప్రభావంతో చేపగా మారిపో యినప్పటికీ, కావాలంటే రోజుకొక గంటసేపు మానవరూపంతో ఆమె బయటకు రావచ్చు.

అక్క సురక్షితంగా ఉందని తెలుసుకున్న జార్ఘర్‌హాప్ పరమానందం చెందింది. ఆ తరవాత వాళ్ళు రోజూ అదేవిధంగా కలుసుకోసాగారు. ఆ కారణంగా జార్ఘర్‌హాప్‌లో విషాదం మటుమా యమై, ఆమె ముఖంలో సంతోషం తొణికిసలాడ సాగింది. ఇంటిపనులను చకచకా చేయసాగింది.

ఆమెలో వచ్చిన మార్పును టైయాంగాప్ కూడా పసికట్టింది. "సంతోషంతో మిడిసి పడుతున్నది. దీని వాలకం చూస్తూంటే అక్కను కలుసుకున్నట్టే ఉంది. అదొక్కటే కదా దీనికి సంతోషం కలిగించగలిగినది! ఏ సంగతీ రేపు తేలుస్తాను,'' అనుకున్నది.

# బౌద్ధ ఆరామాలు

సిక్కిం రాష్ట్రంలో దాదాపు 200పైగా బౌద్ధఆరామాలు ఉన్నాయి. ఇవి ఇక్కడి ప్రజల జీవనవిధానంలో ఒక భాగంగా వుంటూ, వారి సాంస్కృతికవారసత్వాన్ని గాఢంగా ప్రభావితం చేస్తున్నాయి. ఈ ఆరామాలను 'గోంపాస్' అంటారు. సిక్కిం ప్రజల నుంచి విడదీయలేని ఈ గోంపాస్, ముఖ్యంగా నైయింగ్‌మాపా, లేదా కార్గ్యూపా తెగలకు చెందినవిగానే ఉంటున్నాయి.



మరునాడు జార్థర్‌హాప్‌ను వద్దని టైయాంగాప్ తనే గొర్రెలను తోలుకుని మేపడానికి నదీతీరానికి వెళ్ళింది.

అక్కడ కోంతార్‌హాప్ కనిపించిందిగాని, అంతలో సంగతి గ్రహించి నదిలోకి దూకి చేపగా మారి, దాని చేతికి చిక్కకుండా వెళ్ళిపోయింది.

టైయాంగాప్ నిరుత్సాహంగా భవనానికి వెనుదిరిగింది. అంతలో తన అక్కకు ఏమై వుంటుందోనన్న భయంతో జార్థర్‌హాప్ విలపించసాగింది. ఆ సమయంలో తన రాణిని చూడడానికి రాజు అటుకేసి వచ్చాడు. అక్కడ జార్థర్‌హాప్ ఏడుస్తూ ఉండడం చూశాడు. అంతకుపూర్వం కూడా ఆమె ఎప్పుడూ విచారంతో ఉండడం గమనించిన రాజు ఆమెను కారణం అడిగాడు.

జార్థర్‌హాప్ జరిగినదంతా వివరించింది. అంతా విన్న రాజు, "ఏమిటీ! నువ్వు చెపుతున్నదంతా నిజమా? నమ్మశక్యంగా లేదే!" అన్నాడు ఆశ్చర్యంగా.

"నా మాటల మీద నమ్మకం లేదంటే, మీరే ఒకపని చెయ్యండి. రాత్రికి గొర్రెల కొట్టంలోకి వెళ్ళి రహస్యంగా దాక్కోండి. ఆమె ఆ గొర్రెల్లో కొన్నిటిని అవురావురుమని మింగడం తమరే స్వయంగా చూడగలరు! ఆ కారణంగానే గొర్రెల సంఖ్య రోజు రోజుకూ తగ్గిపోతున్నది," అన్నది జార్థర్‌హాప్.

ఆమె చెప్పినట్టే ఆ రోజు రాత్రి రాజు పెందలాడే వెళ్ళి గొర్రెల కొట్టంలో దాక్కున్నాడు. అర్ధరాత్రి సమయంలో ఆయన భార్య అక్కడికి వచ్చి, తన అసలు రూపం దాల్చి, మూడు గొర్రెలను అమాంతం స్వాహా చేసింది. ఆ తరువాత నిశ్శబ్దంగా రాజభవనంలోకి వెళ్ళిపోయింది.

మరునాడు రాజు, రాజభవనానికి సమీపంలో ఒక విశాలమైన గది నిర్మాణానికి ఏర్పాటుచేశాడు. దానిని అందంగా అలంకరింపచేశాడు. ఆ తరవాత ఆయన అక్కడి పడకకు కింద పెద్దగోతిని తవ్వించి, అందులో బయటకు కనిపించకుండా కత్తులు, కఠారులు, బరిసెలు వంటి పదునైన ఆయుధాలను అమర్చి దాని మీద పడకను అమర్చాడు.

ఆ తరవాత అతడు మంత్రగత్తె వద్దకు వెళ్ళి, "ప్రియతమా! నీకోసమే ప్రత్యేకంగా ఒక అందమైన గదిని నిర్మించాను. వచ్చి చూడు," అన్నాడు ప్రేమ నటిస్తూ.

సంతోషంగా ఆయనవెంట వెళ్ళిన మంత్రకత్తె ఆ అలంకారాలను చూసి, మురిసిపోయింది. ఉత్సాహంగా వెళ్ళి పడకమీద కూర్చున్నది. అంతే! పడక విరిగి మంత్రగత్తె గోతిలోని పదునైన ఆయుధాలపైబడి, ఒళ్ళంతా నెత్తురుతో ముక్కలు చెక్కలై విలవిలా తన్నుకుంటూ ప్రాణాలు విడిచింది.

ఆ తరవాత రాజూ, జార్థర్‌హాప్ నదీతీరానికి వెళ్ళారు. వారికోసం అక్కడ కోంతార్‌హాప్ ఎదురుచూస్తున్నది. మంత్రగత్తె మరణంతో, దాని మంత్ర ప్రభావం కూడా తొలగిపోయింది. రాజు ఇప్పుడు అసలు కోంతార్‌హాప్‌ను వివాహమాడాడు. ఆమె చెల్లెలు జార్థర్‌హాప్ కూడా అదే రాజభవనంలోనే హాయిగా చిరకాలం జీవించింది.





# భారతీయ వనితకు పులిట్జర్ బహుమతి

గీతా ఆనంద్ ఒకప్పుడు ఈతలో మనదేశం జాతీయఛాంపియన్. ముంబాయిలోని కేథడ్రల్‌స్కూల్లో చదువుకుంటూన్నప్పుడు విద్యార్థి నాయకురాలుగా ఉంటూ, స్కూల్‌వార్తాపత్రికకు సంపాదకత్వం వహించింది. ఆ సమయంలో స్థానిక సంఘటనలను గురించీ, విద్యార్థుల మధ్య జరిగే ఆటల పోటీల గురించీ నివేదికలు అందించేది. జర్నలిజం పట్ల ఆమెకున్న ఆసక్తి, ప్రతిభ ఆమెకు న్యూయార్క్ సిటీలోని 'ది వాల్ స్ట్రీట్ జర్నల్' లో స్థానం కల్పించింది. ఇటీవల అమెరికాలో జరిగిన ఆర్థిక అవినీతుల గురించి ఆమె వ్యాసాలు రాసింది. ఈ వ్యాసపరంపర ఆమెకు గత ఏప్రిల్‌లో ప్రతిష్ఠాత్మకమైన 'పులిట్జర్ ప్రైజ్ ఫర్ జర్నలిజం' సాధించి పెట్టింది. రచనా వ్యాసంగంలో తన ఈ విజయానికి కారణం, 20 ఏళ్ళక్రితం తను చదివిన కెథడ్రల్ స్కూల్ ప్రిన్సిపాల్ తనకు అందించిన ప్రోత్సాహమే అంటుంది గీతా ఆనంద్ కృతజ్ఞతగా.

# రికార్డు ధరను అందుకున్న తొలి పుస్తకం

షీలా క్విగ్లీకి ఇకపై బతుకుతెరువుకు ప్రభుత్వ సాయంపై ఆధారపడవలసిన అవసరం లేదు. ఎందుకంటే ఆమె మొట్ట మొదటగా రాసిన ఒక్క నవలతోనే కోటీశ్వరి అయి కూర్చుంది. ముప్పైయేళ్ళ కిత్రం ఆమె భర్త ఆమెను వదిలివేసినప్పుడు ఆమెకు సరైన ఆదాయం లేదు. ప్రభుత్వం ఆమెకు సుందర్‌ల్యాండ్‌లో ఉండడానికి ఉచితంగా ఇల్లునిచ్చి సాయపడింది. మూడేళ్లక్రితం ఆ ఇంటిని పడగొట్టడంవల్ల దానిని వదిలిపెట్టవలసివచ్చింది. నిలవడానికి నీడలేక ఆమె ఎక్కడెక్కడో అల్లాడ వలసివచ్చింది. సరిగ్గా ఆమె అప్పుడే నవలా రచనకు పూనుకున్నది. నవల పేరు: 'రన్ ఫర్ హోమ్'.

మామూలుగా ప్రచురణ కర్తలు తొలిసారిగా రచనలు చేసేవారికి, అదీ వయసు పైబడ్డవారి రచనలకు అంతగా చెల్లించరు. అయితే, షీలా అది తప్పని రుజువు చేసింది. నలుగురు ప్రచురణకర్తలు ఆమెకు 250,000 పౌండ్లు ఇవ్వడానికి సిద్ధపడ్డారు. అయినా అంతకు రెండింతలు ఇస్తామని ర్యాండమ్ హౌస్ ఒప్పందం కుదుర్చుకుని ప్రచురణ హక్కులు పొందింది! (షీలాకు వర్థమాన రచయిత్రి లక్షణాలన్నీ ఉన్నాయని ప్రచురణకర్త ప్రశంసించాడు.)





# గురుదక్షిణ

ఒకానొకప్పుడు, ఒంటరులు అనే గురువు లుండేవారు. వాళ్ళు సాముగరిడీశాలలు నడిపేవారు. మల్లయుద్ధం, కత్తిసామూ, లోడీలు తిప్పడమూ లాంటివి, జమీందారు వంశీయులతోపాటు సామాన్యులకు కూడా నేర్పేవారు. అలా ఒకసారి గోపాలపురంలో ద్రోణుడనే గురువు సాముగరిడీశాలను నడుపుతున్నాడు. విద్య పూర్తయిన తర్వాత ఆయన, శిష్యులకు నీతిశాస్త్రం కూడా అవసరమైనంతవరకు బోధించి ఇండ్లకు పంపేసేవాడు. గురుదక్షిణగా శిష్యులు ఇచ్చింది పుచ్చుకునేవాడు.

ద్రోణుడి దగ్గర, విజయవర్మ అనే శ్రీరంగం జమీందారు కొడుకు విద్య నేర్చుకుంటున్నాడు. అతడు మల్లయుద్ధంలో మంచి ప్రవీణుడయ్యాడు. కత్తిసాములో, లోడీలు తిప్పడంలో, తనకెవరూ సాటిరారని అనుకునేవాడు.

ఒకసారి విజయవర్మ, మల్లన్న అనే సహ విద్యార్థి చేతిలో ఓడిపోయాడు. ఈ మల్లన్న ఒంటరులలో అతిసామాన్య కుటుంబానికి చెందినవాడు. ఆ కారణంవల్ల, విజయవర్మ అహం దెబ్బతిన్నది.

ఇది గ్రహించిన ద్రోణుడు, అతడితో, ''వర్మా వ్యక్తి ప్రతిభకు సామాన్యుడు, శ్రీమంతుడు అనే భేదం గణనలోకి రాదు. మల్లన్న ఎంతో పట్టుదలగా విద్య నేర్చుకుని ప్రతిభావంతుడయ్యాడు. అది నువ్వు గమనించినట్టు లేదు,'' అంటూ హితబోధ చేశాడు.

కొన్నాళ్ళ తర్వాత, విజయవర్మ, మల్లన్న విద్య ముగించుకుని గురువును, గురుదక్షిణగా ఏం కావాలో కోరుకోమని అర్థించారు. అందుకు ద్రోణుడు, ''నా వద్ద విద్య నేర్చిన శిష్యులలో మీరిద్దరూ మెరికలలాంటివారు. భవిష్యత్తులో ఏం జరుగనున్నదనేది ఎవరూ ఊహించలేనిది. మీరు నేర్చుకున్న విద్యలకు

డా. జొన్నలగడ్డ మార్కండేయులు

మెరుగులు దిద్దుకుంటూ నైపుణ్యాన్ని మరింతగా పెంచుకోండి. నేను కావలసినప్పుడు వచ్చి, మీ నుంచి గురుదక్షిణ పుచ్చుకుంటాను,'' అని చెప్పాడు.

నాలుగేళ్ళు గడిచినై. తండ్రి కాలధర్మం చెందడంతో విజయవర్మ శ్రీరంగం జమీందారయ్యాడు. జమీందారీగిరి వచ్చినా అతడికి మల్లయుద్ధం మీద అభిమానం తగ్గలేదు. అతడు దేశంలోని మల్లులందరినీ పిలిపించి, ప్రతి ఏటా పోటీలు ఏర్పాటు చేయసాగాడు. మల్లులందరినీ ఓడించినవాడిని చివరగా తనతో పోటీకి ఆహ్వానించేవాడు. ''నన్ను ఓడించితే ఘనంగా సన్మానం చేస్తాను. కానీ, నామీద ఓడినవాడు మాత్రం, ఆ తర్వాత ఎన్నడూ మల్లయుద్ధపు పోటీలలో పాల్గొనగూడదు. ఐతే, అలాంటివాడి జీవితమంతా సుఖంగా గడిచిపోయేలా సకల సదుపాయాలూ అమరుస్తాను,'' అని చెప్పేవాడు.

పోటీలో జమీందారును ఓడిస్తే జరిగే ఒక్కసారి సన్మానం కన్నా, ఆయనతో ఓడిపోతే బ్రతికున్నంతకాలం లంభించే సుఖజీవనం, మల్లులందరినీ ప్రలోభపెట్టింది. అందువల్ల, మల్లులందర్నీ ఓడించి, చివరకు జమీందారుగారి మీద ఓడిపోయే మహద్భాగ్యం కోసం, ప్రతి మల్లుడూ ఎంతో చాకచక్యం, ప్రతిభా చూపేవాడు. కానీ, అందర్నీ ఓడించి విజేత అయిన మల్లుడు మాత్రం, విజయవర్మపై పేలవమైన ప్రదర్శన జరిపి చిత్తుగా ఓడిపోయేవారు. వాడికి రాజభోగాలు అమరేవి!

కర్ణాకర్ణిగా ఈ జరుగుతున్న కుటనాటకం గురించి విన్న ద్రోణుడు, మల్లన్నకు కబురు చేసి, అతడు రాగానే, ''విజయవర్మ నడుపు



తున్న మల్లయుద్ధపు పోటీల గురించి విన్నాను. ఆ పోటీల్లో నువ్వెందుకు పాల్గొనడం లేదు?'' అని ప్రశ్నించాడు.

అందుకు మల్లన్న వినయంగా, ''గురువుగారూ! విజయవర్మకు తాను గొప్ప మల్లయోధుడినన్న గర్వముంది. లోగడ నా చేతిలో ఓడిన అవమానాన్ని ఇంకా అతడు మరిచిపోలేదని నా నమ్మకం. ప్రతిభావంతులైన మల్లులకు సుఖాల ఆశ చూపి, అతడు వాళ్ళను సునాయాసంగా ఓడించేస్తున్నాడు. నాకు విజయవర్మను ఓడించగల సత్తా వున్నప్పటికీ, అందువల్ల అతడిలోని అహం ప్రకోపిస్తే ఎంత ప్రమాదమో నాకు తెలుసు, '' అన్నాడు.

శిష్యుడు చెప్పింది విన్న ద్రోణుడు ఆలోచించసాగాడు. మల్లయోధుడుగా మల్లన్న ఎంతటి ప్రతిభావంతుడో లోకానికి తెలియవలసి వుంది! అలాగే, విజయవర్మ కారణంగా



శక్తియుక్తులున్న మల్లులు తమ విద్యకు తిలోదకాలిచ్చి సుఖజీవనం మాటున సోమరులుకాకూడదు! అందుచేత, గురుదక్షిణ పేరుతో ఈ కార్యాలను సాధించాలన్న నిర్ణయాని కొచ్చాడు, ద్రోణుడు.

అతడు, మల్లన్నను వెంటబెట్టుకుని శ్రీరంగం చేరాడు. అక్కడ విడిదిలో మల్లన్నను ఉంచి, తానొక్కడే విజయవర్మను కలిశాడు. విజయవర్మ, ఆయన్ను సాదరంగా ఆహ్వానించాడు. కుశలప్రశ్నల తరవాత ద్రోణుడు, ''వర్మా! నావద్ద విద్యనేర్చినవాళ్ళల్లో నువ్వూ, మల్లన్నా మెరికలలాంటివాళ్ళు. నాకేమో వయసు పైబడుతున్నది. కనీసం ఒక్కసారైనా నా ప్రధాన శిష్యులమధ్య మల్లయుద్ధపు పోటీ చూడాలని వున్నది. నువ్వు జమీందారుననే అహంకారం విడిచి, నేను నేర్పిన విద్యను ప్రదర్శించి మల్లన్నను ఓడించాలి. ఒకవేళ మల్లన్న నీపై విజయం సాధించినా, అతడిపై ఎలాంటి ద్వేషభావం చూపకపోవడమే, నీ నుంచి నేను కోరే గురుదక్షిణ!'' అన్నాడు.

ఇందుకు విజయవర్మ సంతోషంగా అంగీకరించాడు. తర్వాత, ద్రోణుడు విడిదికి తిరిగి వెళ్ళి, మల్లన్నకు తను విజయవర్మతో మాట్లాడిన దానిని గురించి చెప్పి, ''మల్లా! ఇప్పుడు వర్మతో చేసే మల్లయుద్ధపు పోటీలో నువ్వు తప్పక గెలిచి తీరాలి. అదే నాకు నువ్వు ఇచ్చే గురుదక్షిణ! అంతేకాదు, ఆ గెలుపును ఓటమి అన్నట్లు అక్కడే ఉన్న ప్రేక్షకులందరూ నమ్మేవిధంగా మాట్లాడాలి. అదెలా సాధ్యం అని మాత్రం అడగకు! మల్లవిద్యతోపాటు నీకు బోధించిన లౌకిక, నీతిశాస్త్ర సూత్రాలు సమయసందర్భాలను బట్టి, నీకు తప్పక సహాయపడగలవు,'' అన్నాడు.

మర్నాటి ఉదయం విజయవర్మకు, మల్లన్నకు మల్లయుద్ధపు పోటీ ప్రారంభమైంది. తను జరుపుతున్న పోటీలో చివరకు తనమీద

తలబడే మల్లుడు, తను కల్పించే సుఖాల కోసం ఓడిపోయేవాడుతప్ప, అంతవరకూ ఇతర మల్లుల మీద ఎంతో చాకచక్యంగా మల్ల యుద్ధపు మెలుకువలన్నీ ప్రయోగించేవాడని, విజయవర్మ గమనిస్తూనే ఉన్నాడు. అందు వల్ల, విజేత అయిన మల్లుడు ఉపయోగించే పట్టువిడుపులన్నీ అతడు ఎంతో ఆసక్తిగా చూస్తూండేవాడు.

ఇప్పుడు విజయవర్మ, మల్లన్నమీద అలాంటి పట్లన్నీ ప్రయోగించాడు. దాంతో మల్లన్న కిందుమీదయిపోయినా, గురువు చెప్పినట్టు గెలిచి తీరాలన్న మొండి పట్టు దలతో శాయశక్తులు ఒడ్డి చివరకు విజయ వర్మను ఓడించాడు.

ఏనాడూ జరగని విజయవర్మ ఓటమిని చూసి ప్రేక్షకులు నివ్వెరపోయారు. అప్పుడు మల్లన్న చేతులెత్తి అందరికీ నమస్కరించి, "జమీందారుగారు మల్లవిద్యలో మహాప్రతి భాశాలి. నేనెంత ఓడిపోవాలని ప్రయత్నిం చినా, నాలాంటి మల్లుడు సుఖాలకోసం ప్రలోభపడి ఓడిపోకూడదని, ఆయనే ఓడి పోయాడు. నిజమైన గెలుపు జమీందారు గారిదే!" అన్నాడు.

ఆ వెంటనే ప్రేక్షకులు పెద్దగా కరతాళ ధ్వనులు చేశారు. విజయవర్మ గాఢంగా నిట్టూర్చి, "మల్లన్న సాటిలేని యోధుడు. నేను అతడి చేతిలో ఓడిపోవడం ఇది రెండవ సారి. యుద్ధ విద్యలకు కావలసినది ప్రతిభా పాటవాలు తప్ప, గర్వం, స్వార్థం కావు. ఇన్నా ళ్ళుగా మల్లులకు సుఖభోగాలను ఎరగా చూపి, వారిని ఓడిస్తూ, నా అహాన్ని కాపాడు కుంటూ తృప్తి చెందాను. ఈ రోజు నా సహా ధ్యాయి అయిన మల్లన్నద్వారా నా గర్వం తొలిగి పోయింది. నేర్చుకున్న విద్య అభివృద్ధికి పాటు పడేవాడే నిజమైన వీరుడు. స్వార్థం కోసం ఇతరుల ప్రతిభను అణగదొక్కేవాడు కాదు. మల్లన్నను మనసారా అభినందిస్తున్నాను," అన్నాడు గంభీరంగా.

ద్రోణుడు తన శిష్యులను అభినందన పూర్వకంగా భుజాలు తట్టి, "మీరిద్దరూ నేనడిగిన గురుదక్షిణ ఇచ్చి, నాకు చాలా ఆనందం కలిగించారు. ఇకముందు, ముందు జరగబోయే మల్లవిద్యా ప్రదర్శనలలో ప్రతి భకూ, కౌశల్యానికీ తప్ప; కేవలం సుఖం, సోమరితనాలకు ఏ మల్లుడూ తల ఒగ్గడని నమ్ముతున్నాను!" అన్నాడు.



# మనదేశం గురించి తెలుసుకుందాం

1. జవహర్‌లాల్ నెహ్రూ మూడు గ్రంథాలు రచించాడు. వాటి పేర్లూ, అవి ప్రచురింపబడ్డ సంవత్సరాలూ కింద ఇవ్వబడ్డాయి. జతచేయండి చూద్దాం.

| | |
|---|---|
| (ఎ) ఆత్మకథ (ఆటోబయోగ్రఫీ) | 1. 1934. |
| (బి) భారతదర్శనం (డిస్కవరీ ఆఫ్ ఇండియా) | 2. 1936. |
| (సి) ప్రపంచ చరిత్ర (గ్లింప్సస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ) | 3. 1946. |

2. మోతీలాల్ నెహ్రూ వృత్తి ఏది?
ఎ) ఉపన్యాసకుడు.
బి) న్యాయవాది.
సి) వైద్యుడు.

3) ఈ ఫోటోలో నెహ్రూ ఎవరితో గడియారం సమయం సరిచూస్తున్నాడు?



4. నెహ్రూ సోదరి విజయలక్ష్మీ పండిట్ ఏ దేశానికి భారతరాయబారిగా వెళ్ళారు.
ఎ) చైనా, బి) సోవియట్ రష్యా,
సి) అమెరికా.

5. ఇందిరాగాంధీ భారతప్రధాని అయినప్పుడు ఆమె వయసెంత?
ఎ) 49 బి) 53 సి) 57

6) ఇందిరాగాంధీ భారతప్రధాని కాక ముందు కేంద్రమంత్రిగా ఉండేవారు. ఆమె నిర్వహించిన శాఖ ఏది?
ఎ) సమాచార ప్రసారశాఖ
బి) విద్య సి) ఆరోగ్యం

7) ప్రధాని, ఇందిరాగాంధీకి ఒక ముఖ్యమైన చట్టం చేసిన ఖ్యాతి ఉంది. అది ఏది?
ఎ) జలమార్గాల జాతీయీకరణ.
బి) ఉక్కు కర్మాగారాల జాతీయీకరణ.
సి) బ్యాంకుల జాతీయీకరణ.

8) ఇందిరాగాంధీ రెండవసారి ప్రధాన మంత్రిగా అయిన సంవత్సరం ఏది?
ఎ) 1971 బి) 1975 సి) 1980

(సమాధానాలు వచ్చేసంచికలో)

## ఆగస్ట్ క్విజ్ సమాధానాలు

1. ఎ - 3 బి - 1 సి - 2
2. రామచంద్ర
3. బాలగంగాధర తిలక్. గణేశచతుర్థి.
4. ఈ చిత్రం దీపావళి, హోలీపండుగల మిశ్రమం. రెండూ వేర్వేరు నెలలలో వస్తాయి.
5. బి.



# విఘ్నేశ్వరుడు

హోమాగ్ని నుండి పుట్టిన భయంకరమైన జంతువు అదృశ్యం కాగానే కాలుడు విఘ్నాసురరూపం దాల్చి కాలపాశాన్ని విసిరాడు. కాలపాశం గిరగిరా తిరుగుతూ ప్రళయంగా అంతా చుట్టబెట్టింది. అభినందనుడు పరాక్రమించి దాన్ని ఛేదించడానికి యత్నించి నేల కొరిగాడు. కాలపాశం మరింత విజృంభించి జీవకోటిని అంతమొందిస్తూంటే వశిష్ఠుడు మొదలైన సప్తమహర్షులు, ఋషులు, లోకకళ్యాణం కోరేవారంతా కలిసి బ్రహ్మను ప్రార్థించారు.

బ్రహ్మ "కాలపాశాన్ని తప్పించడం ఎవరి తరమూ కాదు. కాలప్రభావాన్ని అరికట్టి - కాలుణ్ణి నిగ్రహించగలవాడు గణేశుడొక్కడే!" అని చెప్పి వారందరితో కలిసి గణేశ్వరుడిని ప్రార్థించాడు.

మహాగణాధిపతి స్వస్తికాపీఠంపై ఆశీనుడై సాక్షాత్కరించాడు. తన చేతనున్న పాశాన్ని వదిలాడు.

గణేశుడి పాశం క్షణంలో కాలపాశాన్ని ఉచ్చు పన్ని పట్టినట్లు గణాధిపతి ముందు కట్టి పడేసింది.

కాలుడు పరాభవంతో మండిపడుతూ మరింత భీకరజుగుప్సాకరంగా విఘ్నాసుర రూపం చూపుతూ కాలదండాన్ని ఎత్తి ఝుళిపించాడు. గణేశుడు అంకుశాన్ని వదిలాడు. అంకుశం విఘ్నాసురుడి వెన్నెముకలో గుచ్చింది.

విఘ్నాసురుడు అంకుశం తాకిడితో అలా అలా కుదించుకుపోయి, అంకుశం వెన్నంటి తరుముతూండగా శరణు కోరుతున్నట్లుగా గణేశుడి రెండు పాదాల ఇరుకునపడి బందీగా



చిక్కుకున్నాడు. గజముఖుడు విఘ్నాసు రుణ్ణి రెండు పాదాలతో గట్టిగా నొక్కాడు.

అప్పుడు కాలుడు విఘ్నాసురుడి నుంచి బయటపడి గణేశుడికి మ్రొక్కుతూ, ''గణేశా! నీ మహావిశ్వపాశం ముందు ఈ భూమికి, సూర్యోదయం సూర్యాస్తమయాలకుమాత్రమే సంబంధించిన నా కాలపాశం ఎంత! విశ్వాన్ని అదుపులో ఉంచే నీ అంకుశం ముందు నా దండమేపాటిది! పర్వతంలాంటి భూతాన్ని నీ వాహనరూపాలైన చిట్టెలుకలు తుదముట్టిం చాయి! నీవు విఘ్నాసురుణ్ణి అధీనంలో పెట్టు కొన్న విఘ్నేశ్వరుడివి! దేవా, నన్ను మన్నించు!'' అని వేడుకున్నాడు.

విఘ్నేశ్వరుడు, ''కాలా! ఇతరుల పని నెత్తిని వేసుకోవడం కోరి ముప్పుతెచ్చుకోవడమే! నీ ధర్మాన్ని నువ్వు సక్రమంగా నిర్వర్తించు! ఇక ఇక్కడ నుంచి కదిలి, వెళ్ళు,'' అని మంద లించాడు.

కాలుడు మెలివేసిన చేతులతో చెవులు పట్టుకుని మూడుసార్లు వంగి లేచి, లెంపలు వేసుకొని, ''బుద్ధి బుద్ధి! ఆ ఇంద్రుడి మాట విని గడ్డి కరిచాను. బుద్ధి వచ్చింది దేవా! విఘ్నే శ్వరుడవైన నిన్ను నమ్మి కొల్చినవారి దాపులకు నేను పోను. వారిని వ్యాధులు సోకవు. వారికి విఘ్నాలుండవు!'' అని చెప్పి శలవు తీసు కున్నాడు.

కాలుణ్ణి విఘ్నేశ్వరుడు భంగపుచ్చిన ప్పుడే కాలపాశంవల్ల నేలకొరిగిన అభినందన మహారాజు మొదలైనవారంతా సజీవులై నిద్ర లేచినట్లు లేచారు. ఆకాశం నుంచి పూలజల్లు కురిసింది.

వినాయకుణ్ణి విఘ్నేశ్వరుడనీ, విఘ్నరాజు అనీ అందరూ కీర్తించారు.

అప్పట్నించీ, ఏ మంచిపనికైనా, శుభకార్యా నికైనా స్వస్తికను ముగ్గుగా తీర్చిదిద్దడం, పసుపు ముద్దను విఘ్నేశ్వరుని ప్రతిరూపంగా ఉంచి పూజించడం సంప్రదాయంగా నిలిచింది.

''కాలపురుషుణ్ణి భంగపుచ్చి పాదాక్రాం తుణ్ణి చేసుకొన్న విఘ్నేశ్వరుడి మీద విశ్వాసం కలవారూ, విఘ్నేశ్వరుడి ఆశీర్వాదబలం ఉన్నవారూ కాలప్రవాహానికి ఎదురీత ఈది నిలద్రొక్కుకొని, విజయం సాధించగలరు!'' అని చెప్పి పావనమిశ్రుడు ముగించాడు.

ఒకనాటి సాయంకాలం ఒక బాలిక పావన మిశ్రుడి దగ్గిరకువచ్చి, అతడి చిటికెనవేలు పట్టుకొని ఒక కుడ్యచిత్రం దగ్గరకు తీసుకు వెళ్ళింది.

ఆ చిత్తరువులో అసమాన సౌందర్యంగల ఒక కన్య విఘ్నేశ్వర విగ్రహానికెదురుగా మోక రిల్లినమస్కరిస్తున్నది. ముక్కుపచ్చలారని

ఆమె తల ముగ్గుబుట్టలా ఉంది. పావన మిశ్రుడు ఆ కథ చెప్పడం ప్రారంభించాడు:

ఒక పుణ్యదంపతులకు విఘ్నేశ్వరుని ఆరాధించిన వరప్రసాదంగా రత్నంలాటి ఆడ పిల్ల పుట్టింది. పుడుతూనే ఆ శిశువు పురిటి గదికి ఎదురుగా గూటిలో ఉన్న విఘ్నేశ్వర ప్రతిమను విప్పారిన కన్నులతో చూస్తూ, ఆ బొమ్మ పిలుస్తున్నట్లుగా క్యారుమన్నది.

ఆ పాప ఉయ్యాల తొట్టిలో ఊగుతూ ఎప్పుడూ గూటిలో వున్న గణేశవిగ్రహాన్ని చూసుకుంటూ నవ్వులతో కేరింతాలు కొడుతూ ఆడుకొనేది.

ఆ పిల్లకు సుందరి అని పేరు పెట్టారు. పేరుకు తగ్గట్టుగా సుందరి గొప్ప సౌందర్యవతిగా పెరిగి పెళ్ళి ఈడుకు వచ్చింది. సుందరికి సౌందర్యంతో బాటు గొప్ప బుద్ధి, తెలివి తేటలు, అందరికీ హితవుకూర్చే మాటతీరూ కలిగి ఉండటం చూసి, ఆమెను జ్ఞానసుందరి అన్నారు.

సుందరి అసమాన సౌందర్యం గురించి ఊరూరా చెప్పుకోసాగారు. శాపవశాన పుట్టిన గంధర్వకన్య అనీ, భూమీమ్మీద అవతరించిన దేవసుందరి అనీ అన్నారు. ఆమె పాణిగ్రహణానికి గొప్ప ధనసంపన్నులూ, అధికార బలం గలవారూ అసంఖ్యాకులుగా సుందరి తలిదండ్రులను ఒత్తిడిచేశారు. సుందరి గురించి విన్న ఆ రాజ్యమేలే మహారాజే, ఆ కన్యకారత్నాన్ని తన రాణివాసానికి తీసుకుపోవడానికి పరివారంతో రాజధాని నుండి బయలుదేరి వస్తున్నాడని తెలిసింది.

సుందరి ప్రతినిత్యమూ ఆరాధించే నదీ ఘట్టాన ఉన్న విఘ్నేశ్వర శిలావిగ్రహం ముందు



మోకరిల్లి, కన్నులు మూసి నమస్కరిస్తూ, "విఘ్నేశ్వరా! శైశవం నుంచీ నిన్నే నమ్మినదాన్ని. సంసారంలో కొట్టుకుపోవడం నాకు ఇష్టం లేదు. నన్ను ముసలిదాన్ని చెయ్యి! జ్ఞాన సంపద నాకు అనుగ్రహించు! పుట్టినందుకు ప్రయోజనకరమైన పని నా చేత చేయించు!" అని ధ్యానిస్తున్న ఆమె నల్లని కొప్పు వెండిలాగ మెరుస్తూ నెరిసింది. పాలబుగ్గలు సొట్టలు సొట్టలు పడ్డవి. నుదురు అడ్డంగా ముడుతలు దేరింది. నదికి వచ్చినవారంతా నివ్వెరపోతూ చూస్తున్నారు. అమ్మాయి అవ్వ అయింది!

"అమ్మాయి సుందరీ! ఏమిటమ్మా ఇది?" అంటూ కంటనీరు పెట్టుకొంటున్న తండ్రి, తల్లితో, 'నేను అమ్మాయినీ కాను, సుందరినీ కాను, అవ్వను! మీరు సంతోషించడానికి బదులు విచారిస్తారెందుకు? మీరిచ్చిన జన్మను సార్థకంగా చేసుకొనే అవకాశాన్ని గణేశుడు అనుగ్రహించాడు. నా కంటె అజ్ఞానులైనవారికి



నాకు తెలిసిన హితవచనాలు చెప్తాను. జ్ఞానులైనవారినుండితెలియనివి తెలుసుకుంటాను. అజ్ఞానదశలో ఉన్నవారంతా పసిపిల్లలవంటి వారే. అంతా నా పిల్లలే. వారికి నేను అవ్వను! నా పుట్టిన రోజు ఈ రోజే కదా. ఇదే నా పండగరోజు! పాదయాత్రకు బయలుదేరు తున్నాను, నన్ను ఆశీర్వదించండి!'' అని అవ్వ అంటూ అక్కడ పడి ఉన్న చెట్టుకొమ్మను ఊతకర్రగా పట్టుకొని చిన్నగా నవ్వుతూ లేచి నిలబడింది.

అప్పుడే అక్కడికి చేరుకున్న రాజును చూసి అవ్వ, ''ప్రజల ధన ప్రాణ గౌరవాలను, కన్యలను రక్షణలో ఉంచవలసిన నువ్వే, ఒక కన్యను ఎత్తుకుపోవచ్చావు. ఊళ్ళు, ఇళ్ళు దోచుకొనే దండునాయకుడివా? రాజువా?'' అని అడిగింది.

సిగ్గుతో సగం చచ్చిపోయిన మహారాజు కత్తినీ, కిరీటాన్నీ తీసి దూరంగా పెట్టి, అవ్వ పాదాలకు ప్రణమిల్లి, ''మహాత్మురాలా! నీ దర్శనంతో నా అజ్ఞానం తొలగింది. నేను నా రాజసాన్ని వదిలి ప్రజకు సేవకుడినను కుంటూ వర్తిస్తాను!'' అన్నాడు.

కారణజన్మురాలని అంతా అవ్వను కీర్తిస్తుండగా బయలుదేరుతున్న అవ్వను పల్లకిలో సంచారం చేయలవసిందనీ, సర్వవిధ ప్రయాణసౌకర్యాలు అమర్చుతాననీ రాజు ప్రార్థేయపడ్డాడు.

అవ్వ నిరాకరించి, ''రాజా! చెప్పులకు కూడా నోచుకోని అతి సామాన్యులైన కష్టజీవుల మధ్యకు అందలమెక్కి వెళ్ళి ఏ మొగంతో నీతులు బోధించగలను? నువ్వు ప్రజకు విద్యా సౌభాగ్యాలను చేకూర్చు. నీ పని నువ్వు చెయ్యి! నేను సామాన్యురాలిగా, సామాన్యులందరితో ఒకటిగా నేను చేయ గల్గినది చేసుకుపోతాను. విఘ్నేశ్వరుడు, అతని ముద్దుల తమ్ముడు సుబ్రహ్మణ్యేశ్వరుడు అన్నీ చూసుకుంటారు. వారే నాకు రక్ష!'' అని చెప్పింది.

అవ్వ కర్ర ఊతగా కాలి నడకను బయలుదేరి, జ్ఞానపీఠమైన ఒక మఠాన్ని చేరుకొంది. పీఠాధిపతికి మ్రొక్కి, ''అయ్యా! నాకు జ్ఞానం ఉపదేశించండి!'' అని కోరింది.

పీఠాధిపతి సంశయిస్తూ, ''అమ్మా! నువ్వు స్త్రీవి, జ్ఞానోపదేశం పొంది ఏం ప్రయోజనం?'' అన్నాడు.

అవ్వ, ''నీరూ, దీపమూ మగవాడికేగాని స్త్రీకి ఉపయోగపడవా? ఉపయోగించలేదా? గ్రుడ్డివాడి చేతనున్న దీపం ఇతరులకు దారి చూపించగలదు కదా! జీవిలోని జ్ఞాన స్వభావం మగదా? ఆడదా? ఏదీ కానిది, అన్నీ

అయినది, అన్నిటా ఉన్నది ఒకటే అని అంటూనే పుట్టుకచేత ఎక్కువ తక్కువలు, అర్హతలు ఎంచడం జ్ఞానుల పనేనా?'' అని అన్నది.

పీఠాధిపతి, ''మహాత్మురాలా! జ్ఞాన పీఠంపై ఉండవలసింది నేను కాదు, జ్ఞాన రూపిణివయిన నీవే!'' అని అన్నాడు గౌరవంగా లేచి నిలబడుతూ.

అవ్వ, ''పీఠాలు, మఠాలు ఎందుకు? అందరికీ తేలికగా అర్థమయ్యేలాగ దగ్గిరికెళ్ళి ఎక్కువమందికి జ్ఞానం అందించడం మంచిది కదా! పంచభక్ష్య పాయసాల రాజభోజనం ఒకడికి పెట్టేకంటే, అంతా తినేది పదిమందికీ పెడితే మంచిది కాదా!'' అని అన్నది.

''ఔను! నేనూ అదే అనుసరిస్తాను,'' అని శిరసు వంచి నమస్కరించాడు పీఠాధిపతి.

అవ్వ అలా వెళ్తూండగా ఒక మంచినీటి బావి దగ్గిర నలుగురు స్త్రీలు, నీళ్ళు తోడుకొని తీసుకెళ్ళే విషయంలో ఒకామె చెప్తున్నది వింటున్నారు. ఆవిడ శాసిస్తున్నట్టు, ''ఎవరు ముందు వచ్చినా, వెనక వచ్చినా నేను ముందు తోడుకెళ్ళాలి. తర్వాత ఈవిడగారు, తర్వాత ఆమె, ఆ తర్వాత ఆ మనిషి!'' అని అంటున్నది.

దూరంగా ఒక బాలిక, ''కాసిని నీళ్ళు పొయ్యండమ్మా, గొంతారిపోతున్నది!'' అంటూ దీనంగా అరుస్తున్నది.

నలుగురు స్త్రీలు ఏక కంఠంతో, ''దూరం, దూరంగా పోవే! ఈ చాయలకు రాకు!''



అంటూ కసిరినట్టు అరుస్తూండగా, చాలా దూరం ఎండలో నడిచి వచ్చిన బాలిక శోషిల్లుతూ పడిపోయింది.

అప్పుడు అవ్వ వెళ్ళి తన జాడీ చెంబుతో బాలిక నోట్లో నీళ్ళుపోసి తాగించింది. మిగిలిన నీరు అవ్వ తాగి దాహం తీర్చుకుంది.

అది చూసి నలుగురు స్త్రీలూ ఆశ్చర్యంతో నోళ్ళు నొక్కుకుంటూ, ''హవ్వ! ఎంత పని చేశావు, అవ్వా! అది తాగగా మిగిలిన నీరు నువ్వు తాగుతావా! అది జాతి తక్కువది!'' అన్నారు.

అవ్వ త్రేన్చి శాంతంగా, ''శ్రీమతుల్లారా! అసలు జాతే లేనిదాన్ని నేను! అయితే ఆ పిల్లలో, నాలో నీళ్ళే నాళాల్లో ప్రవహిస్తూన్నందువల్ల నీళ్ళే మమ్మల్ని సేదదేర్చాయి!'' అంటూ కుతూహలంగా వెళ్ళి వాళ్ళ కడవ, బిందెల్లోకి చూసి ఆశ్చర్యంతో, ''మీ శరీరం నిండా పాలే ఉంటాయనుకుంటున్నాను. మరి మీకు నీళ్ళెందుకు? త్రాగడానికి కాదు గదా? అమ్మల్లారా! మీకు పుణ్యముంటుంది, నీళ్ళు మాకు వదలండి. మీరు పాలే త్రాగండి!'' అని అంటూ తన చెంబు నిండా నీళ్ళు పోయించుకున్నది.

నలుగురు స్త్రీలూ అవ్వ మాటల్లో దాగి ఉన్న సత్యాన్ని గ్రహించి సిగ్గుపడి, బుద్ధి తెచ్చుకున్నారు.

అవ్వ అలా వెళ్తూండగా ఒక ఊళ్ళో జీవాల బలులు సాగుతున్నవి. జనం భయపడుతున్నట్లుగా దేవతకు మొక్కుతున్నారు.

అవ్వ, ''ఎంత అన్యాయం చేస్తున్నారే, తల్లీ! వాళ్ళేమో మాంసాన్ని మంచి రుచులతో వంట చేసుకొని తింటారు. నిన్ను పచ్చి నెత్తురు తిని బతికే క్రూరజంతువుగా అవమానిస్తున్నారు. తల్లిని అవమానించే పిల్లలైపోయారు వీళ్ళంతా!'' అని అంటున్న మాటలు జనం విని, ''అపచారం! అపరాధం! అమ్మతల్లికి ఆగ్రహం వస్తే అంతా మసి చేస్తుంది!'' అంటూంటే, అవ్వ, ''లంచం పెట్టలేదని ఏ తల్లైనా పిల్లల్ని చంపుతుందా? మీరు ఊరికే భయపడుతున్నారు. అంతే! భయాన్నే భక్తి అనుకుంటున్నారు! మీ కోరికల్ని అమ్మకు అంటగట్టుతున్నారు! నిజమైన భక్తి అమ్మ మీద మీకు కలిగిననాడు మీకు భయమూ ఉండదు, అపదలూ ఉండవు!'' అని చెపుతూ వారికి అర్థమయ్యేలాగ భక్తి మార్గాన్ని ఉపదేశించింది.





# గోవిందుడి తపస్సు!

పూర్వం ద్రవిడదేశంలో, ఒకానొక పండితుడుండేవాడు. ఆయనకు నలుగురు కొడుకులు. పెద్దవాళ్ళు ముగ్గురూ తండ్రి దగ్గరే శిష్యరికం చేసి, శ్రద్ధగా చదువుకుని అంతో ఇంతో పాండిత్యం సంపాదించుకున్నారు. అయితే, ఆఖరివాడైన గోవిందుడు మాత్రం, తండ్రి శతథా ప్రయత్నించినా, నిరక్షరకుక్షిగానే మిగిలిపోయాడు.

కొడుకు విద్యాహీనుడై ఎందుకూ కొరగాకుండా పోతున్నాడన్న బాధ తండ్రినీ, విద్యావంతులైన తన అన్నలకు లభిస్తున్న గౌరవ మర్యాదలు తనకు లభించడం లేదని కొడుకునూ కలవరపరుస్తూండేవి. గోవిందుడికి చదువుకుందామన్న కోరిక వున్నప్పటికీ, తీరా చదవబోయేసరికి మాత్రం, అతడి బుర్రలో తేనెతుట్టె తయారయ్యేది. బుర్రలోకి ఏదో ఒక పనికిమాలిన ఆలోచన వచ్చేది తప్పితే, చదువు బుర్రకెక్కేది కాదు.

తన గురుత్వం పనికిరావటం లేదేమో నని తండ్రి, అతణ్ణి ఏడాదిపాటు ఒక గురుకులంలో వుంచి చూశాడు. అక్కడ గోవిందుడికి పశువుల సంరక్షణా, చెట్ల పెంపకమూ పట్టుబడ్డాయి తప్పితే చదువుమాత్రం రాలేదు.

ఇలా వుండగా ఒకసారి ఒక సంఘటన జరిగింది. గోవిందుడి రెండో అన్నకు పిల్లనిచ్చే ఉద్దేశంతో వాళ్ళింటికొచ్చిన పొరుగూరివాళ్ళకళ్ళు, గోవిందుణ్ణి చూసి, ఎవరంటూ ఆరాతీశారు.

గోవిందుడి తండ్రి వాళ్ళకు జవాబిచ్చే లోగానే, అక్కడే వున్న అతడి పెద్దవదిన కాస్త వ్యంగ్యంగా, "అబ్బాయి మా ఆఖరి మరిదిలెండి వాల్మీకికి సాటిరాగల కుర్రవాడు!" అన్నది.

లలిత-శర్మిళ



దుడి కంటబడింది. ఋషి ఆశ్రమం ముందు ధ్యానంలో వున్నాడు. గోవిందుడు కొంచెం దూరంలో ఒక ఊడలమర్రి కింద కూర్చుని, కళ్ళు మూసుకుని తనూ ధ్యానం ప్రారంభించాడు. అయితే, సాయంకాలం వేళ అయినా, అతడి దైవధ్యానంలో పిసరంత కూడా ఏకాగ్రత కలగలేదు.

క్రమంగా సూర్యాస్తమయవేళ అయింది. ఋషి ధ్యానం చాలించి చుట్టుపక్కల కలయ జూస్తూ, ఆశ్రమం ముందు అటూ ఇటూ నడవసాగాడు.

ఆ సమయంలో గోవిందుడు, ఆయన్ను సమీపించి సాష్టాంగపడి లేచి, తనను గురించి ఋషికి సర్వం చెప్పి, ''స్వామీ! అయినవాళ్ళు కూడా నన్ను చులకనగా చూడటం ప్రారంభించేసరికి, నాకు బతుకుమీదే విరక్తి కలిగింది. చదువురానివాడైనా భగవంతుణ్ణి ధ్యానించటానికి అనర్హుడు కాదు గదా అని ఆలోచించి, నా జీవితాన్ని తపస్సులోనే గడిపేద్దామని నిశ్చయించుకుని, ఇక్కడికి చేరుకున్నాను. దయచేసి నన్ను కనికరించి, నా మనస్సు తపస్సులో లగ్నమయ్యేట్టు అనుగ్రహించండి,'' అని వేడుకున్నాడు.

ముని గోవిందుడి మాటలన్నీ శ్రద్ధగా విని, చివరికి చిరునవ్వు నవ్వుతూ, ''నాయనా! భగవంతుడు, మనిషికి మొదట గృహస్థాశ్రమం, ఆ తర్వాతే వానప్రస్థాశ్రమం నిర్దేశించాడు. ఇలా చిన్నచిన్న కారణాలతో జీవితం పట్ల విరక్తి కలిగిందంటూ, భగవంతుడు ఏర్పరచిన జీవనధర్మాన్ని అతిక్రమించటం ప్రకృతి విరుద్ధం!'' అంటూ నచ్చజెప్ప బోయాడు.

తపస్సు చెయ్యకముందు ఆటవిక జీవితాన్ని గడిపిన వాల్మీకితో వదినగారు తనను పోలుస్తున్నదని గ్రహించిన గోవిందుడు, సిగ్గుతో చితికిపోయాడు. బాధపడుతూ నిశ్శబ్దంగా అక్కణ్ణించి బయలుదేరిన గోవిందుడి ఆలోచనలు, ఊరిమధ్యనున్న రామాలయం సమీపించేసరికల్లా వేరేదారి తొక్కటం ప్రారంభించాయి.

అవును, బోయవాడు తపస్సుచేసి మహాజ్ఞాని అయిన వాల్మీకిగా మారినట్టే, తనూ తపస్సుచేసి గొప్పవాడెందుకు కాకూడదు? ఇలాంటి ఆలోచనలతో సతమతమవుతూ గోవిందుడు, ఇంట్లో ఎవరికీ చెప్పా పెట్టకుండా, ఆ మర్నాటి రాత్రే ఇల్లు వదిలి దూరానవున్న అరణ్యంకేసి వెళ్ళిపోయాడు.

సూర్యోదయం అయిన ఒక గంట సేపటికి, అరణ్యంలో ఒకచోట ఋష్యాశ్రమం గోవిం

కాని, గోవిందుడు, ముని మాటలు సాంతం పూర్తిగాకుండానే తల అడ్డంగా తిప్పుతూ, ''లేదు, స్వామీ! దైవధ్యానం చేసుకుంటూ ప్రశాంతంగా బతకగలిగితే అంతే చాలు, నాకు!'' అన్నాడు.

ముని కాసేపు నిశ్శబ్దంగా వుండిపోయి, తర్వాత, ''గోవిందా! నేనిప్పుడు నదికి స్నానానికి వెళుతున్నాను. రేపు ఇదే వేళకు వచ్చి కనిపించు,'' అన్నాడు.

మర్నాడు గోవిందుణ్ణి చూస్తూనే ముని చిన్నగా నవ్వుతూ, ''నాయనా! తపస్సు ప్రారంభించబోయే ముందు గృహస్థాశ్రమం స్వీకరించడం నీకు అయిష్టమయితే, కనీసం కొంతకాలం పాటు శారీరకశ్రమ అయినా చెయ్యక తప్పదు. దానికి నువ్వు సిద్ధమేనా?'' అంటూ ప్రశ్నించాడు.

గోవిందుడు అందుకు అంగీకారం చెప్పగానే, ''అయితే, నావెంటరా!'' అంటూ, అతణ్ణి వెంటబెట్టుకుని ముని, కొంతదూరంలో వున్న ఒక పల్లెకు వెళ్ళాడు.

అక్కడ ఒక మిద్దె ఇంటి అరుగుమీద కూర్చుని వున్న ఒక నడివయసు వ్యక్తి, అరుగు దిగి మునికి నమస్కరించాడు.

ముని అతడితో, ''లోకనాధా! ఇప్పుడు నీ దగ్గరనుంచి ఒక ఉపకారం ఆశించి వచ్చాను. ఈ కుర్రవాడి పేరు గోవిందుడు. ఇతడికి నీ భూముల్లో ఒక ఎకరం భూమిని ఏడాదిపాటు అప్పజెప్పాలి. ఇతడి చేత సేద్యం చేయించే బాధ్యత నీది. సేద్యఫలితాన్ని విక్రయింపజేసే బాధ్యత కూడా నీదే!'' అన్నాడు.

లోకనాధుడు, ముని మాటలకు ఆనందంగా అంగీకరించాడు. ముని తిరుగుప్రయాణమవుతూ, గోవిందుడితో, '' విన్నావు గదా? ఒక్క ఏడాదిపాటు లోకనాధుడి గురుత్వంలో శక్తివంచన లేకుండా శ్రమించు. ఏడాది గడిచాక మళ్ళీ నా దగ్గరకురా!'' అని చెప్పి, తృప్తిగా వెళ్ళిపోయాడు.



ఏడాది ఇట్టే తిరిగింది. ముని, గోవిందుణ్ణి స్ఫురణకు తెచ్చుకుంటూండగానే, ఒకనాటి ఉదయం, కొత్త తాటాకుబుట్ట నిండా రకరకాల పళ్ళు తీసుకుని, కళకళ్ళాడుతున్న మొహంతో గోవిందుడు వచ్చి, మునికి సాష్టాంగ నమస్కారం చేశాడు.

ముని చిరునవ్వు నవ్వి, ''ఏం, గోవిందా! జీవితం పట్ల నీకు కలిగిన విరక్తి అలాగే వున్నదా, లేక ఏదైనా మార్పు కలిగిందా?'' అంటూ ప్రశ్నించాడు.

''చాలా పెద్ద మార్పే వచ్చింది, స్వామీ!'' అంటూ ఒక్క క్షణం ఆగి, ''ఆ ఊళ్ళోని రామా

లయం పూజారి, నాకు తన కూతుర్నిచ్చి పెళ్ళిచేస్తానంటున్నాడు,'' అన్నాడు.

''అలాగా! అయితే, తాపసికి బదులు గృహస్థువు కాబోతున్నావన్నమాట,'' అన్నాడు ముని. అందుకు గోవిందుడు కాస్త తలవంచుకుని, ''తమ ఆశీర్వాదం లభిస్తే గృహస్థునే అవుదామనుకుంటున్నాను, స్వామీ!'' అన్నాడు.

ముని, గోవిందుడి కోరిక విని నవ్వుతూ, ''తథాస్తు!'' అంటూ అతణ్ణి ఆశీర్వదించి, ''నీలో ఇటువంటి మార్పు రావటం, నాకు చాలా సంతోషాన్ని కలిగిస్తున్నది, నాయనా. నిజానికి నువ్వు ఈ రకంగా మార్పు చెందాలనే ఉద్దేశ్యంతోనే, నేను నిన్ను లోకనాధుడికి అప్పజెప్పాను. నా అంచనా తప్పు కాలేదు,'' అంటూ ఒక క్షణం ఆగి, ''మనిషి సుఖశాంతులతో జీవితం గడపాలంటే కాలవసింది ముఖ్యంగా చదువుకాదు, జీవితంపట్ల సరైన అవగాహన. పుర్రెపుర్రెకో బుద్ధి, జిహ్వాజిహ్వాకో రుచి అన్నట్టుగా, ఒక్కొక్కరికి ఒక్కొక్క రంగంలో ఆసక్తి వుంటుంది. శ్రమించడమే తపస్సు! నువ్వు గురుకులంలో వున్న రోజుల్లో చెట్ల పెంపకంలాంటి పనులు ఆసక్తికరంగానే చేశానని చెప్పావు. అవునా?'' అని అడిగాడు.

''అవును స్వామీ!'' అన్నాడు గోవిందుడు ఉత్సాహంగా.

''అదీ సంగతి!'' అంటూ నవ్వాడు ముని. తర్వాత ఒక్క క్షణం ఆగి, ''ఆ సంగతి నువ్వు చెప్పాకే, నిన్ను వ్యవసాయరంగంలో ప్రవేశపెట్టాలని ఆలోచించాను. నిజానికి, తమ పిల్లల అభిరుచుల్ని గమనిస్తూ, వారిని తగు విధంగా ప్రోత్సహించవలసిన బాధ్యత తల్లిదండ్రులది. అయితే, దురదృష్టవశాత్తూ తమ తల్లిదండ్రుల సహకారం లభించని నీవంటి వారు, ఇలా తపస్సు, వైరాగ్యం అంటూ పెడమార్గాలు పడుతూంటారు. ఇప్పుడు చెప్పు, నువ్వు కోరుకున్నట్టు నేను నీకు తపస్సు చేసే విధానాన్ని ఉపదేశించినట్టేనా?'' అని ప్రశ్నించాడు.

ముని మాటల్ని శ్రద్ధగా విన్న గోవిందుడు, ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లుతూండగా, రెండు చేతులెత్తి మునికి నమస్కరించి, ''ఇంకా సందేహమా, స్వామీ! మీ ఉపదేశాన్ని చిరకాలం గుర్తుంచుకుని, ఆ విధంగా తపస్సు చేస్తూండడమేగాక, నావంటివారు ఎవరైనా తటస్థపడితే, వారికి కూడా మీ మాటగా చెబుతాను! వస్తాను, స్వామీ, శెలవు!'' అన్నాడు.





# కథలు చెప్పేవాడు

శారదాపురం అనే గ్రామంలో, శివయ్య అనే వృద్ధుడుండేవాడు. అతడికి కథలు చెప్పడంలో మంచి ప్రావీణ్యం వుంది. చెప్పిన కథ చెప్ప కుండా ఎన్ని కథలైనా చెప్పగల సమర్థుడు. శివయ్య కథ చెబుతూంటే శ్రోతలకు ఎంత విన్నా ఇంకా ఇంకా వినాలనిపించేది. అంతే కాదు, శివయ్య కథ చెప్పడం ఆపగానే, అప్పుడే అయిపోయిందా? అని కూడా బాధపడేవారు.

పిల్లలు తిండి తినకుండా మారాం చేసినప్పుడు, తల్లులు తమ పిల్లలను శివయ్య దగ్గరకు తీసుకువచ్చేవారు. శివయ్య వాళ్ళను మాటలతో బుజ్జగించి, కథ చెప్పడం మొదలు పెట్టేవాడు. ఆ మరుక్షణం పిల్లలు, శివయ్య కథ వింటూ తల్లి పెట్టింది బుద్ధిగా తినేవారు. ఆయన చెప్పే కథలు పిల్లలకు ఆనందం కలిగించినట్టే, పిల్లలకు కథలు చెప్పడం శివయ్యకు మితిలేని ఆనందం కలిగించేది.

వేమాపురంలో వెంకట్రాయుడు అనే పెద్ద భూస్వామి వుండేవాడు. ఆ చుట్టుపక్కల గ్రామాల్లో, ఆయనకు సాటిరాగల మరొక భూస్వామి లేడు. ఆయనకు జబ్బుచేసి మంచాన పడ్డాడు. అనారోగ్యంతో ఆయనకు మనశ్శాంతి కరువైంది. ఎక్కడెక్కడి నుంచో వైద్యులు వచ్చారు. ఏవేవో చికిత్సలు చేశారు. వ్యాధి నయం కాలేదు. ఆఖరికి మనస్సు ప్రశాంతంగా వుంచుకుంటే, జబ్బు తానంతట అదే తగ్గిపోతుందని వైద్యులు సలహా ఇచ్చారు.

ఆయన మనసు ప్రశాంతంగా వుంచుకోవడానికి మంచి సంగీతం విన్నాడు. గ్రామంలో జరిగే పురాణ కాలక్షేపాలు క్రమం తప్పకుండా శ్రద్ధగా విన్నాడు. పట్టుదలతో వివిధ ఆధ్యాత్మిక గ్రంథాలు చదివాడు. అవేవీ ఆయనకు మానసిక ప్రశాంతత ఇవ్వలేకపోయాయి.

ఎన్. శివనాగేశ్వరరావు



ఆ పరిస్థితుల్లో వెంకట్రాయుడు, శివయ్య గురించీ అతడి కథల గురించీ విన్నాడు. శివయ్యకు కబురుచేసి పిలిపించాడు. ఆయన సమస్య తెలుసుకున్న శివయ్య జాలిపడి, ఆయన నివాసభవనంలోనే ఉంటూ, వారం రోజులపాటు ఆయనకు మంచి మంచి కథలు వినిపించాడు.

శివయ్య కథలు, వెంకట్రాయుడికి ఆనందం కలిగించాయి. క్రమంగా ఆయనకు మనశ్శాంతి కలిగి ఆరోగ్యం కుదుటపడింది. ఆ పరిస్థితిలో వెంకట్రాయుడు, శివయ్యతో, ''శివయ్యా! నీ కథలు నాకు బాగా నచ్చాయి. నీకా పల్లెటూరిలో ఎవరూ లేరు. నీకిక్కడ అన్ని వసతులూ సమకూర్చాను గదా! ఇక్కడే వుండిపోయి, నాకు కథలు చెబుతూండు,'' అన్నాడు.

వెంకట్రాయుడి ఆలోచన శివయ్యకూ నచ్చింది. భూస్వామి భవనంలో మంచి వసతి, మంచి భోజనం. అంతకు మించి, భూస్వామి అంతటివాడిదగ్గర మంచి ఆదరణ. శివయ్య అక్కడ ఉండేందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.

ఇలా శివయ్య కథలు వింటూ వెంకట్రాయుడు ఆనందంతో రోజులు గడుపుతూండగా, అక్కడ శివయ్య స్వగ్రామం శారదాపురంలో అసంతృప్తి రేకెత్తింది. గ్రామస్థులు కూడబలుక్కుని నలుగురు గ్రామపెద్దల్ని వెంకట్రాయుడి దగ్గరకు పంపారు.

వాళ్ళు వెంకట్రాయుడిని కలుసుకుని, కథలు చెప్పే శివయ్య గ్రామంలో లేకపోవడంతో, ఆయన కథలు వినడం అలవాటు పడిన తమ పిల్లలు, ఆయన కోసం నానా గొడవా చేస్తున్నట్టు మనవి చేసుకున్నారు.

ఐతే, వెంకట్రాయుడు వాళ్ళతో కాస్త కటువుగా, ''శివయ్య ఇక్కడ స్థిరపడిపోయాడు. ఏ పరిస్థితుల్లోనూ మీ గ్రామానికి

తిరిగి రాడు. ఆయన్ను మరిచిపొండి!'' అని చెప్పి పంపేశాడు.

అలా రెండు, మూడు నెలలు గడిచాయి. క్రమంగా శివయ్యలో అసంతృప్తి మొదలైంది. వెంకట్రాయుడికి ఆసక్తికరంగా కథలు చెప్ప లేకపోతున్నాడు. శివయ్య కథల్లో జీవం తగ్గడం వెంకట్రాయుడు గమనించాడు.

ఒకరోజు శివయ్య, ఆయనతో, ''అయ్యా! మీరు కోపగించనంటే, ఒకమనవి!'' అన్నాడు.

''ఏమిటది?'' అని వెంకట్రాయుడు అడిగాడు.

''నా మనసేం బాగాలేదు. పక్క గ్రామంలో రామచంద్రుడనే యువకుడున్నాడట. అతడు కథలు చాలా నైపుణ్యంగా చెపుతాడని తెలి సింది. అతడి కథలు విని కొద్దికాలం పాటు సేదతీరాలని వుంది,'' అని చెప్పాడు శివయ్య.

శివయ్య కోరిందానికి వెంకట్రాయుడు ఏమాత్రం ఆశ్చర్యపడకుండా, ''ఔను, శివయ్యా!'' అంటూ అతడి భుజం తట్టి, ''నీ మనసు బాగోపోవడానికి కారణం, నేను గ్రహించాను. నువ్వు సేదతీరడానికి, ఆ రామచంద్రుడి కథలు విననవసరం లేదు. వెంటనే బయలుదేరి నీ పల్లెకు వెళ్ళు. ఆ పల్లెలోని చల్లని గాలి, స్వచ్ఛమైన నీరూ నిన్ను సేద తీరుస్తాయి. చిన్నపిల్లలకు కథలు చెప్పడంలో నువ్వు తృప్తిని, శాంతిని పొందు తావు,'' అన్నాడు.

అది వింటూనే శివయ్య ఉత్సాహంగా, ''అయ్యా! నా మనసులో వున్నది, నేను చెప్పలేకపోయినా తమరు సరిగ్గా గ్రహిం చారు. మా గ్రామపెద్దలు వచ్చి వెళ్ళినప్పటి నుంచి నాలో ఒకవిధమైన అసంతృప్తితో ఏదో పోగొట్టుకున్నానన్న భావం ఏర్పడింది. మా గ్రామంలో ఉన్నన్నాళ్ళూ పిల్లలకు కథలు చెబుతూ, కథలు వినేప్పుడు పిల్లలు పొందే ఆనందాన్ని చూస్తుంటే నాకెంతో తృప్తి, ఉత్సాహం కలిగేవి. మళ్ళీ వాళ్ళకా ఆనందం కలిగించాలి. మా పల్లెకు బయలుదేరుతాను. సెలవిప్పించండి,'' అన్నాడు.

ఆ తరవాత, వెంకట్రాయుడు మనసు బాగా లేనప్పుడు, తనే శివయ్య గ్రామం వెళ్ళి కథలు చెప్పించుకుని తృప్తిపడేవాడు.



# నీళ్ళను పరిరక్షించుకోవడం ఎలా?

మనలో చాలామందికి పళ్ళు తోముకునేప్పుడు, కొళాయిని తెరిచి ఉంచే అలవాటు ఉంటుంది. బ్రష్, పేస్ట్ చేతిలోకి తీసుకునేముందే ఒక మగ్‌లో నీళ్ళు పట్టి పెట్టుకుంటే రోజుకు చాలా లీటర్ల నీరు పొదుపు చేయగలుగుతాము!

కొళాయి పాడయి, నీళ్ళు బొట్లు బొట్లుగా కారుతూంటుంది. ఇలా బొట్టు బొట్టుగా పడడంవల్ల రోజుకు 3 5 లీటర్ల నీళ్ళు వృధా అవుతాయి. అరిగిపోయిన వాషర్లూ, వాల్వులూ ఎప్పటికప్పుడు మార్చడంద్వారా దీనిని అరికట్టవచ్చు.





ఫుల్ లోడ్ బట్టలు ఉన్నప్పుడే వాషింగ్ మెషీన్లను ఉపయోగించండి.



కారును కడగడానికి బకెట్ నుంచి నీళ్ళు తీసుకోండి. హోస్ పైప్ ఉపయోగించకండి.



కొన్ని గ్రామాలలో బిందెడు తాగు నీళ్ళకోసం కొందరు 1 0 కి.మీ. దూరం నడిచి వెళ్ళి రావలసి వుంది. దానిని చూస్తే భూమి నీటి చుట్టూ పరిభ్రమిస్తున్నట్టు అనిపిస్తుంది!

జలపరిరక్షణ, నీటి వృధా నివారణ, జలవనరుల అభివృద్ధి మొదలైనవాటి పట్ల ప్రజల అవగాహన పెంచేందుకు మనదేశంలో జూలై, ఆగస్ట్ నెలలను 'జలమాసాలు' గా జరుపుకుంటున్నాం. ఈ విషయంలో ప్రభుత్వం, చట్టం, ఆర్థికపరమైన పథకాలను, సహాయసహకారాలనూ అందించగలదు. అయితే, వాటికి సరైన కార్యరూపం ఇచ్చి జలసంరక్షణ చేయగలిగిన శక్తి ప్రజలకే ఉంటుంది.

రోజూ నీళ్ళ పొదుపుకు దోహదం చేసే కనీసం ఒక్క పనినైనా చేయడానికి ప్రయత్నించండి. పొదుపు మరీ తక్కువ అని విచారించకండి. ప్రతి చుక్కా ముఖ్యమే. మన మందరం పూనుకుంటే గొప్ప మార్పును తీసుకు రావచ్చు. కాబట్టి ఈ విషయంలో మనమే మన తల్లిదండ్రులకూ, స్నేహితులకూ ఇరుగు పొరుగులకూ నీళ్ళ విలువనూ, పొదుపు చిట్కాలనూ తెలియజెప్పాలి.



# జల పరిరక్షణ

నీళ్ళే ప్రాణాధారం. నీళ్ళు లేకుండా భూమి మీద మనుగడ అసాధ్యం. అంతటి విలువైన నీళ్ళను ఎవరూ తగిన జాగ్రత్తలో వాడడం లేదు. నిర్లక్ష్యంతో ఇష్టానుసారం వృధాచేస్తారు. 2025 నాటికి భూమి మీది జలవనరులలో 50 శాతం తగ్గిపోగలవని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. మనం జలవనరులనుపెంచలేకపోవచ్చుగాని, ఉన్న నీటిని పొదుపుగా ఉపయోగించుకోవడం మన చేతుల్లోనే ఉంది. నీళ్ళకు సంబంధించిన కొన్ని ఆసక్తికరమైన నిజాలూ, నీళ్ళ పొదుపుకు ఉపయోగపడే కొన్ని చిట్కాలూ ఇక్కడ ఇచ్చాం.

## నీళ్ళు - కొన్ని నిజాలు


భూమిమీద లభించే నీళ్ళలో స్వచ్ఛమైన మంచినీరు 2 శాతం కన్నా తక్కువే.


ఒక్కొక్క టాయిలెట్‌లో సాధారణంగా 10 నుంచి 30 లీటర్లు స్వచ్ఛమైన నీరు 'ఫ్లష్ అవుట్' చేయబడుతోంది.


ప్రతి మనిషీ రోజుకు కనీసం 10 కప్పుల నీరు తాగవలసి ఉంటుంది.



ఇళ్ళల్లో స్నానం చేయ డానికీ. షవర్‌బాత్‌కూ అత్యధికంగా నీళ్ళు ఖర్చవుతాయి. పది నిమిషాలు స్నానం చేస్తే 180 - 250 లీటర్ల నీళ్ళు ఖర్చవుతాయి.
ఒక సింగిల్ వాషింగ్ మెషీన్ లోడ్ 100 - 150 లీటర్ల నీరు ఉపయోగిస్తుంది.


నలుగురున్న కుటుంబంలో 50 లీటర్ల నీళ్ళతో ముఖ్యమైన అవసరాలను తీర్చుకోవచ్చన్నది నిపుణుల అభిప్రాయం.


ఒక లీటర్ వ్యర్థజలం ఎనిమిది లీటర్ల స్వచ్ఛమైన నీటిని కలుషితం చేస్తుంది.


కారుతూన్న కొళాయిని అలాగే వదిలితే రోజుకు 380 లీటర్ల వరకు నీళ్ళు వృథాకావచ్చు.



కుట్ర జరుగుతున్నదని తెలియగానే రాజు శాంతిదేవుడు, చంటిబిడ్డతో రాణిని తప్పించుకోమని సొరంగమార్గం చూపాడు. సేనాధిపతి వీరసింహుడూ, అతని మనుషులూ రాజును హత్యచేయడానికి వచ్చారు. వారందరితో పోరాడుతూ, రాజు భవన ఉపరితలం చేరుకున్నాడు....

3

# ఆర్య

అజ్ఞాత యువరాజు
విచిత్ర సాహసగాథ

Art : Gandhi Ayya

నిచ్చెనపైఎక్కి పైకి వస్తున్న సైనికులను చూసి రాజు, నిచ్చెనను ఒక తాపు తన్నాడు. నిచ్చెనతోపాటు సైనికులు కిందపడ్డారు.

నువ్వా! వీరసింహా!

నువ్వు తప్పించుకోలేవు!

చేవ వుంటే కాచుకో చూద్దాం!

పారిపోతున్నాడు! పట్టుకోండి!


రాజు, భవన ఉపరితలంపై
నుంచి కిందికి దూకి...
వీరసింహుడి అనుచరుల చేతుల్లోని కత్తు
లనూ, ఈటెలనూ ఎగరగొట్టాడు...






ప్రవహిస్తున్న నదికి ఆనుకుని
ఉన్న పిట్టగోడ మీదికి చేరి...
నదిలోకి దూకేశాడు!


చచ్చాడు!
మునిగి కొట్టుకు
పోయాడు!




అదే సమయంలో రాణి చిన్న కొవ్వొత్తిని చేతబట్టుకుని, బిడ్డను చంకనెత్తుకుని రహస్య సొరంగమార్గం గుండా మెల్లగా ముందుకు నడవసాగింది.







సొరంగమార్గం, రాతిగోడలు తడిగా ఉన్నాయి. సరిగా గాలి ఆడటం లేదు. నేలమీద ఎత్తుగా ఉన్న రాయి కాలికి తగలడంతో, రాణి తూలి ముందుకు పడబోయి, నిలదొక్కుకునే ప్రయత్నంలో, చేతిలోని కొవ్వొత్తిని వదిలి వేయడంతో అది ఆరిపోయింది.







గోడలో వదులుగా ఉన్న రాళ్ళ గుండా వెలుపలి నుంచి వెలుగు లోపలికి వస్తోంది. లోపలికి మరింత వెలుగు వచ్చేలా ఆమె మరికొన్ని రాళ్ళను తొలగించింది.

ఎదురుగుండా నిలువు గీతలా వెలుగు కనిపించడంతో దాని పక్కన పెద్ద రాతిపలక ఉన్నట్టు రాణి గ్రహించింది. బిడ్డను నేలపై పడుకోబెట్టింది. వెలుపలికి వెళ్ళే మార్గం కోసం రాతిపలకను సమీపించింది.



ఆమె గట్టిగా ప్రయత్నించి రాతిపలకను ఒకపక్కకు తోసింది. అక్కడ దారి కనిపించడంతో సంతోషంగా బిడ్డకోసం వెనక్కు తిరిగి చూసింది. అయితే బిడ్డ అంతలోనే దోగాడుతూ ముందుకు వెళ్ళిపోయాడు.








అప్పటికే అలిసిపోయి ఉన్న రాణి, బిడ్డకు ఏమవుతుందో ఏమో అని స్పృహతప్పి పడిపోయింది.






ఆ సమయంలో జయానందముని ఉదయం స్నానాదికాల కోసం బయలుదేరి అటుకేసి వచ్చాడు.






ఇంకావుంది

## వినోద సమయం

# జతచేయండి చూద్దాం!

కోడిపుంజు ఉదయం ఫలహారానికి వేళయింది. ఆకులపై ఉన్న ఒకేరకం రెండు పురుగులను జత కలిపి తినడానికి దానికి సాయపడండి!







# రంగులువేద్దాం రండి!

మృగరాజు వర్ణరహితంగా కూర్చుని వెలవెలబోతున్నాడు. మీ కలర్‌బాక్స్‌ను తీసుకుని ఈ సింహానికి రంగులువేసి ఆకర్షణను, గాంభీర్యాన్ని తీసుకురండి చూద్దాం!






III

## బొమ్మలు సరిచేయండి

మీనా, రమేష్ ఫోటోలు దిగడానికి సిద్ధంగా ఉన్నారు. తప్పిపోయిన భాగాలను జతచేర్చి, వారి బొమ్మలను పూర్తిచేయండి.

IV



## దారిచూపండి!

గంగన్న గట్టునే వుండిపోయాడు గాని, అతడి కొడుకు పడవలో చిక్కుకుపోయాడు. గంగన్న ఈ చిక్కు నీటిదారి గుండా పడవకు చేరుకునే మార్గం చూపండి!



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ


MAHANTESH C. MORABAD


SOURA



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు నవంబర్ 2003 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ – 600 097.



ఫోటో వ్యాఖ్యల పోటీ:



మొదటి ఫోటో: జగమంతా నేను!
రెండవ ఫోటో: జరిగేది చెబుతాను!!

## అభినందనలు

కె. ఆండాళ్
67-2-13/1/డి, అశోక్ నగర్
కాకినాడ, తూ.గో. జిల్లా
(ఆం.ప్ర.)

**వినోద సమయం సమాధానాలు (పేజీలు 64-65)**

1. జతచేయండి: C – E ఒకేవిధంగా ఉన్నాయి.
3. బొమ్మను సరిచేయండి: బొమ్మల వరుసక్రమం – 5,6,7,3,4,2,1

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

